ఈ తరం యువతీ యువకుల్ని మానసికంగానూ శారీరికంగానూ ఏ అపోహలూ, దురలవాట్లూ లేకుండా తీర్చిదిద్దేందుకు కృషిచేసే డాక్టర్లకూ, ఉపాధ్యాయులకూ, సంఘ సేవకులకూ ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాం. దీనిని చదవటం ద్వారా మానసిక శారీరిక ఆరోగ్యాలను కాపాడుకుంటూ సంయమంతో చక్కని దాంపత్య జీవితాన్ని పొందుతూ పదికాలాలపాటు ఉత్తమ పౌరులుగా మన యువతరం వర్ధిల్లాలని ఆకాంక్షిస్తున్నాం.

—రచయితలు

# పాఠకులకు విజ్ఞప్తి

హస్తరతివల్ల కలిగిన అనారోగ్యం, నరాలదుర్బలత్వం, శీఘ్రస్కలనం, సంతానం లేకపోవుట, సుఖవ్యాధులు మున్నగు ఏ సమస్యలున్నా మాకు వ్రాయండి. మానుండి తగు సలహాలు, చికిత్స లభిస్తాయి. అయితే మీరు అభిసారిక సం. త్సర చందాదారులయి ఉండాలి. చందాదారులు తమ చందా నెంబరు తెలుపాలి. చందాదారులు కానివారు అభిసారిక సంవత్సర చందా రు 24-00 లు మనియార్డర్ చేస్తూ రశీదును తమ సమస్యకు జతపరచాలి. మీ ఉత్తరాలను మనియార్డర్‌లను ఎడిటర్, అభిసారిక, సామల్‌కోట 533 440 అను ఎడ్రెసుకు పంపాలి.

— మేనేజర్

# సెక్స్ సైన్స్

## స్వరతి గురించి

### స్వరతి అంటే ఏమిటి?

"స్వరతి అనే మాటకు ముందుగా నిర్వచనం చెప్పుకుందాం. స్త్రీలు గాని, పురుషులుగాని యెవరికి వారు కామాన్ని ప్రేరేపించుకుని సంతృప్తి పడటం స్వరతి అంటాం. హస్తప్రయోగం ఈ కోవకువస్తుంది. అంతమాత్రాన స్వరతిలో విధిగా చేతిని ప్రయోగించాలన్న నియమం లేదు. ఉబిలు కోళ్ళను రుద్దుకునే స్త్రీలు. తొడల్ని ఒకదానిమీద కొకటి వేసుకుని రుద్దుకునే స్త్రీలు. తలగడా దిండ్లమీద రతి జరిపే యువకులు ఉన్నారు. ఇలా ఏదోవిధంగా భావప్రాప్తినీ. స్ఖలనాన్ని పొందటాన్నే స్వరతి అంటాము. యిందులో మానసిక ప్రేరణ యెక్కువగా ఉంటుంది. ఊహాత్మక భాగస్వామితో రమిస్తున్నట్టుగా భావించటం జరుగుతుంది. కనుక స్వరతిలో ఉండె సహజమయిన మానసికానందం ఉండదు. మెదడుకు అలసట యెక్కువవుతుంది. అందుకే దానిని సైకిక్ మాస్టర్‌బేషన్ అనికూడా అంటారు.

స్వరతి కొన్ని సందర్భాలలో అసంపూర్ణంగా ఉండవచ్చు. మరి కొన్ని సందర్భాలలో అసంపూర్ణ స్థాయిలో ఉండనూవచ్చు. అనగా స్ఖలన పర్యంతం స్వరతిజరపవచ్చు. లేదాస్ఖలనంజరగకుండా నిరోధింపబడనూవచ్చు. రెండవరకాన్ని "భగ్నరతి" Interrup ed mast. i .tio. అని అంటాము.

భార్యాభర్తలు పరస్పర ప్రేరణ చేసుకోవటాన్ని కొందరు ఈ వర్గానికి తెస్తారు. అలాగే యోనిచూషణం, శిశ్నచూషణం—ఈ కోవకు చెందినవే

నని అంటారు. ఈ అభిప్రాయంతో మేము ఏకీభవించం. అని ప్రయోగింపబడినప్పటికీ సహజమయిన రతితో ముగిసినప్పుడు వాటిని స్వరతిగా భావించటానికి వీలులేదు.

స్త్రీలలో స్వరతి యోనిపరంగా ఉంటుంది. అంతరాధరాలలో ఒక దానినిగాని, రెండిటినిగాని వారు ప్రేరేపించుకోవటం కద్దు. కొందరు స్త్రీలు కేవలం యోనిశిశ్నాన్నే ప్రేరేపించుకుంటారు. కొందరు వేళ్లలనో, యితర వస్తువులనో బీజవాహికలో ప్రయోగించి స్వరతి పొందుతారు. మరికొందరు స్త్రీలు మూత్రద్వారాన్ని ప్రేరేపించుకుంటారు. కొందరు చనుమొనల్ని మాత్రమే నలుపుకుంటారు; పెంపుడుకుక్కల్నీ పిల్లుల్నీ ఉపయోగించినాకించుకుంటారు తొడల్ని ఒకదానిమీదకొకటి ఒరుసుకునేటట్లు చేసుకునిగాని, మొత్తంయోనిని యేదయినా కఠిన పదార్థంపై ఒరపిడి పట్టించిగాని స్వరతికి పాల్పడటం జరుగుతుంది. ఊహలతో (పగటి స్వప్నాలతో) కామప్రేరణనూ, సంతృప్తినీ పొందే మానసిక స్వరతినికూడా కొందరు స్త్రీలు పొందుతున్నారు.

వీటన్నిటినీబట్టి చూస్తే స్త్రీ పురుషుల సంబంధం వ్యభిచారమే అయినా మంచిదే అని అనిపించకమానదు. స్త్రీలు పరస్పరం రమించుకునే లెస్బియానిజంగాని, పురుషులు పరస్పరం రమించుకునే హోమో సెక్సువాలిటీగాని స్వరతికన్నా నీచమయింది. స్త్రీ పురుషుల పరస్పర స్వేచ్ఛా సంగమం మంచిది. వివాహం చాలామంచిది.

## మంచి చెడ్డలు

స్వరతివలన ఏవయినా ప్రమాదాలున్నాయా? లాభాలున్నాయా? ఉంటే ఏవి? అనే ప్రశ్నలు పుడుతున్నాయి.

ఇటీవలి కాలందాకా స్వరతి చాలా ప్రమాదకరమనే అభిప్రాయం వ్యాప్తిలో ఉంది. అన్నిరకాల మానసిక, శారీరక వ్యాధులు దీనివలనే కలుగు

తున్నాయని వైద్య ప్రపంచం భావించింది. ముఖం మీద మొటిమలనుంచి ఉన్మాదం వరకూ అన్నివ్యాధులకూ ఇదే కారణమని చెప్పేవారు: ఇటీవల మరో అతివాదంవచ్చింది. స్వరతివలన యే విధమయిన ప్రమాదం లేదని మనస్సుకీ, శరీరానికీ, లైంగిక విధులకూ యే ఆటంకమూ రాదని అంటు న్నారు. యేది ఏమయినా మగవాళ్ళ నపుంసకత్వానికి, ఆడవాళ్ళ జడత్వా నికీ స్వరతియే కారణమని చెప్పకతప్పదు. అంతమాత్రాన దీనిని తిరుగు లేని వ్యాధిగా భావించనవసరం లేదు. కొంతమంది భావిసున్నట్లుగా యిది వక్రకామం (పెర్వర్షను) గాని, ఆత్మ వ్యామోహం (నార్సిజం) గాని ఉన్మాదపు ప్రాథమిక వ్యవస్థకాని కాదు. అలా అనుకోవటం శుద్ధతప్పు.

ఈ స్వరతి అనాదిగా మానవలోకంలో ఉంది. తగినంతమంది స్త్రీ జనాభా లేని రోజులలో పురుషులు స్వరతిని స్వేచ్ఛగా వినియోగించుకునే వారని చెప్పతగిన ఆధారాలుకూడా ఉన్నాయి.

ఎదవట్టిన రోజులలో స్త్రీ జంతువు దగ్గరలేనప్పుడు చాలా మగజంతు వులు స్వరతికి పాల్పడి ఇంద్రియాన్ని విడుదల చేసుకోవటం చూస్తున్నాం

ముఖ్యంగా యెలుగుబంట్లూ, కోతులూ ఒంటరి తనంలో హస్తప్ర యోగం చేసుకోవటం గమనించండి. కనుక వాటికి వారసుడయిన మనిషి అంతకు భిన్నంగా ప్రవర్తిస్తాడనుకోవటం సరికాదు.

ఋతుకాలాన్ని బట్టి రమించే జంతువులకూ, అనాది మానవులకూ నపుం సకత్వం రాలేదు. ఆధునిక మానవుడు అనునిత్య కాముకుడయినందునే అతనికి నపుంసకత్వం వస్తున్నది. కనుక నపుంసకత్వం ఆధునిక నాగరి కతా ఫలమని చెప్పవచ్చును.

అదీగాక ప్రతిమగాడూ పెళ్ళికాకముందు యెప్పుడో ఒకప్పుడు స్వ రతికి పాల్పడినవాడే. పెళ్ళయిన తర్వాత ప్రతి స్త్రీ యెప్పుడోఒకప్పుడు

స్వరతికి పాల్పడినదే. యిలా అరుదుగా తక్కువకాలం స్వరతిలో పాల్గో వటంవలన వారెవరికీ ప్రమాదం కలగిలేదు.

కాని కొందరి స్త్రీలకు రతిలో యేవిధమయిన ఆనందమూ లభించకు వారి యోనినీ, స్తానిశీర్షాన్ని నలిపినప్పుడే వారికి భావప్రాప్తి కలుగుతుంది అటువంటి స్త్రీలు స్వరతికి అలవాటు పడినవారనే చెప్పాలి. వారికి రతిలో యెలాంటి సుఖమూ లభించదు.

అలాగే కొంతమంది మగవారున్నారు. వారికి స్త్రీలముందు అంగస్తంభనం కలగదు. కలిగినా అంగప్రవేశ సమయంలో స్ఖలించివేస్తారు— లేదా రతి మధ్యలో వారికి స్తంభనవైఫల్యం కలుగుతుంది. యిదిగో ఈ దశనే స్వరతికి అలవాటు పడిన దశగా మనం భావించవచ్చు. వీరిని సరిదిద్దటానికి చాలా కష్టమవుతుంది. వీరికి దాంపత్యానందం లభించటానికిగాను పరస్పర హస్తప్రయోగాన్ని ప్రస్తావన క్రియగా పరిష్కారియిటు చేయవలసి ఉంటుంది.

పరిపూర్ణ యవ్వనంలో ఉన్న యువతి కళ్ళు ఐదేసరికి యువకుని శరీరం కామోద్రేకంతో జ్వలించాలి. అతని చూపులలో మెరుపులు కురిసి, ఆమె అతని కళ్ళలోకి చూడటానికి సిగ్గుపడేటంత కాంతుల్ని వెదజల్లాలి. అలాగే యువకుని చూపులకు తట్టుకో లేక ఆమె శరీరం మత్తుగొని మనసుకు అచేతనావస్థ పొటమరించాలి. దీనినే విభ్రమం (Stupor) అంటాం. మేక కళ్ళలోకి పులి చూసే సరికి మేక నిశ్చేతనమయినట్లు యువతి కళ్ళలోకి యువకుడు చూసేటప్పటికి యువతి నిశ్చేతనంకావాలి. ప్రజ్వలించే కామంలో ఈ శక్తిగలదు. స్వరతికి అలవాటుపడిన యువకునిలో ఈశక్తి ఉండదు. అతను నేరుగా యువతి కళ్ళలోకి చూడనూ లేడు. ఆమెచూసినా అతను కళ్ళుదించుకుంటాడు. అలాగే స్వరతికి అలవాటుపడిన యువతిని యువకుడు చూసినట్లయితే ఆమెలో యే విధమయిన విభ్రమమూ కలగదు. చల్లారి పోయిన కొరకంచులవి. బొగ్గూ, బూడిదా తప్ప యే జ్వాలా లేదు.

వారిరువురూ వివాహం చేసుకున్నారనుకోండి. ఆమె శరీరాన్ని నగ్నంగా నిమిరినా అతనికి కామ వికారం జనించదు. ఆమెకూ అంతే. కనుక ఉభయులూ పరస్పర వికర్షణతో ఒకరినొకరు తప్పించుకు తిరుగుతూ స్వరతి ద్వారా యధాపూర్వకముగా ఉద్రేకాన్ని సడలించుకుంటూ ఉంటారు. ఒకవేళ ఆతను రతికి ప్రయత్నించినా అంగం స్తంభించదు. స్తంభించినా వెంటనే స్ఖలనమయిపోతుంది. స్త్రీ శరీరవాంఛ అతనికి కలగదు యేదో అసహ్యం విరక్తి అతన్ని ఆకరిస్తాయి. అలాగే ఆమెకినీ్న. దాంపత్యమంటే అయిష్టత యేర్పడుతుంది. అంతకన్నా ఆ దాంపత్యానికి ప్రమాదముందా?

కనుక స్వరతివలన వ్యక్తులకు ప్రమాదం ఉన్నా. లేకున్నా దాంపత్యానికిమాత్రం ప్రమాదం వస్తుందని చెప్పక తప్పదు.

అదీగాక ఉభయులకీ ఆత్మన్యూనతా భావం యేర్పడుతుంది. సమాజంలో తాము ఆరోగ్యకరమయిన వైఖరితో సభ్యులుగా తిరగలేక పోతున్నామని గ్రహిస్తారు. ఒంటరితనం వచ్చేస్తుంది. దేనికీ చొరవ లేక పోవటం. సిగ్గు. భయం దాపురిస్తాయి. స్త్రీలకివి భూషణాలుగా భావించినా పురుషులకివి ఏమాత్రం పనికిరావుగదా!

అత్యధికంగా స్వరతికి పాల్పడిన యువతీ యువకులందరికీ పార్శ్వనొప్పి కంటి జబ్బులు. జడత్వమూ. నపుంసకత్వమూ వస్తూనే ఉన్నాయి నరాల బలహీనతయే దీనికి ముఖ్యకారణం యెటొచ్చి యివి శాశ్వతం కావు. కనుక స్వరతిని పూర్తిగా మానుకుని పునర్యవ్వనానికి చికిత్స తీసుకుంటే మళ్ళీ లైంగికారోగ్యం పరిపూర్ణంగా లభిస్తుంది.

యేది యేమయినా అవివాహిత యువతీ యువకులు స్వరతిని మానికఠిన బ్రహ్మచర్య నియమాలను పాటించటం చాలా ఆవసరమని మనవి చేస్తున్నాము.

ఆపత్కాల ధర్మంగా వ్యభిచరించటానికి పూనుకోవటంవలన భయంకర మయిన సుఖవ్యాధులు వస్తున్నాయి, అంతకన్నా స్వరతి ఉత్తమమయిన మాట నిజమే కాని అది రతికి ప్రత్యామ్నాయం కాకూడదు. ఉత్తమోత్తమ మయిన వివాహాన్ని సాధ్యమయినంత తొందరగా చేసుకుని శారీరక, మానసిక సంతృప్తుల్ని పొందటంలోనే ఉదాత్త జీవితముంది. దానిని సాధించటానికే సర్వులూ ప్రయత్నించాలని మా విజ్ఞప్తి.

## సంభావ్యత

స్వరతి చేసుకునే అలవాటు ఆడపిల్లలలో యెక్కువగా ఉందా? మగపిల్లలలో యెక్కువగా ఉందా?— అని అడిగితే మగవారిలోనే యెక్కువ ఉందని ప్రజాభిప్రాయం చెపుతోంది. కాని అది నిజంకాదు.

చిన్నపిల్లల్ని మనం జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఆడపిల్లల్లోనే ఈ అలవాటు యెక్కువగా ఉందని మనకు తెలిసిపోతుంది. అలాంటిచోట్ల ఆడపిల్లలు పన్నెండేళ్ళకే రజస్వల అవుతారు. యింకా తొందరగాకావచ్చు తొందరగా రజస్వల అయ్యారంటే అర్థం తొందరగా లైంగిక అలవాట్లకు లోనయ్యారని అందుకే రజస్వల కాకుండానే ఆడపిల్లలకు పెళ్ళిచేసే అచారం మనదేశంలో వచ్చింది.

కౌమారం వచ్చిన తరువాత ఆడపిల్లలు మగపిల్లలంత యెక్కువగా స్వరతిలో పాల్గోరు. యెందుకో వారికి భయంవేస్తుంది. యెక్కువగా పాల్గొకపోయినా, మొత్తంమీద పాల్గొంటూనే ఉంటారు.

యవ్వనం వచ్చిన తరువాత అనగా 18 సంవత్సరాలు వచ్చిన తరువాత ఆడపిల్లలు మగపిల్లలకన్నా యెక్కువగా స్వరతికి పాల్పడతారు. ఈ వయసులో మగపిల్లలు ఏదోవిధంగా తోటి ఆడపిల్లలతో లైంగిక సంతృప్తి

పొందుతూ ఉండటమే కారణం. ఆడపిల్లలకు మన సమాజంలో యిటువంటి అవకాశాలు లేవు.

యవ్వనం వచ్చిన తొలిరోజులలో మానసికంగా కామోద్వేగం ఉన్నప్పటికి ఆడపిల్లలకు 24 ఏళ్ళు వచ్చేదాకా కామచైతన్యం అంకురించదు. అనగా రతి సంతృప్తికోసం తహతహలాడటం జరగదు. కనుక సాధ్యమయినంతవరకూ నిగ్రహంగానే ఉంటారు. 24 ప్రవేశించే సరికి వివాహం కాకపోయినా, తరచు శీఘ్రస్ఖలనం ఉన్నా తీవ్ర స్థాయిలో స్వరతికి పాల్పడటం జరుగుతుంది.

అయితే ఆరోగ్యంగా చురుకుగా తెలివిగా ఉండే అమ్మాయిలు కౌమారంలో ఉన్నప్పుడుకూడా ముఖ్యంగా బహిస్టుకు ముందు రోజులలో స్వరతికి పాల్పడటం కద్దు. యెప్పుడో ఒకప్పుడు ఎంతోకొంత కామానుభవం కలిగి పరిస్థితులవలన దూరమయిన అమ్మాయిల విషయమిది.

కొందరమ్మాయిలకు కామానుభవం ఉన్నప్పటికీ వారిలో కామప్రవృత్తి (Sexual instinct) మేల్కొదు—అలాంటి అమ్మాయిలకు రతి అంటే ఆసక్తి ఉండదు. స్వరతిపైకూడా విముఖత ఉంటుంది; దీనికికారణం Congenital Sexual hypoaesthesia అని శాస్త్రజ్ఞులంటున్నారు. అనగా పుట్టుకనుంచి ఆమెకు కామ వైముఖ్యం కలిగిందనీ, రతిలో చలించే వైశిత్యం ఆమె జననాంగానికి లేకపోవటమే కారణమనీ అన్నారు. యిది అనారోగ్య లక్షణమనీ దీనివలన ఆ దంపతులకు దాంపత్య సుఖం ఉండదనీ అన్నారు

జడత్వంజాడ్యమే గనుక ఈరకం జాడ్యం లేని స్త్రీలు ఒంటరి జీవితంలో యేదోవిధంగా కామసంతృప్తి పొందటం జరుగుతోంది. ఏదో పరధ్యానం ( Reverie) లో పడి తమకు తెలియకుండానే స్వరతికి పాల్పడటం పురుషులలోకన్నా స్త్రీలలోనే చాలా యెక్కువ

భారతదేశం మానవ స్వభావాలమీద యేనాడో పరిశోధించింది కనుకనే బాల్య వివాహాలే ఈరకం స్వరతికి, వక్రకామానికి విరుగుడుగా భావించి. వాటిని అమలు జరిపింది గనుకనూ, బహుభార్యాత్వాన్ని, బహుభర్తృత్వవ్యవస్థనూ అనుమతించినందువల్లనూ దాంపత్య జీవితంలో అసంతృప్తివలన స్వరతికి పాల్పడే దౌర్భాగ్యం ఆనాటి భారతీయ మహిళలకు లేకుండాపోయింది.

## స్వరతి ప్రోద్బలకాలం

14-16 సంవత్సరాల వయసులో మగపిల్లలకు కామోద్రేకం ఉధృతంగా రగులుకుంటుందని యిదివరకే చెప్పుకున్నాం అది నిద్రపట్టనివ్వదు అంగ స్తంభనం పేట్రేగిపోయి. సలుపు పుడుతుంది, ఒళ్ళు మదజ్వరంతో తాపం పెడుతుంది— ఆలోచనలు అమ్మాయిల వక్షోజాలమీదకు పోయి క్రూరత్వంతో వారిని రమించాలన్న ఊహలు జనిస్తాయి. కళ్ళు యెర్రబడతాయి. నిద్రరాదు. ఊహలు పెరిగిన కొలది తాపం పేట్రేగుతుంది. ఈ రకం మనస్థితికి అతడు హడలిపోతూనే ఉంటాడు. మనసును సంబాళించుకోవటానికి మాటిమాటికీ ప్రయత్నిస్తూనే ఉంటాడు. అయినా అతనికి తెలియకుండానే మనసు మళ్ళీ ఆ రకం ఆలోచనల వలయాలను సృష్టించుకుంటుంది.

అందుకే ఆ వయసు మగపిల్లలలో ముష్కరత్వం, పరధ్యానం, మరుపు ప్రారంభమవుతాయి. పూర్వంలా చదువు సాగదు. మార్కులు తగ్గిపోతాయి. మూర్ఖత్వం పెరిగిపోతుంది. చురుకుగా యేపనీ చేయలేడు; ఈ వయసులోనే చెల్లెళ్ళమీద అక్కలమీద ద్వేషం అంకురిస్తుంది. వారు నిషిద్ధ పరిధికి చెందిన ఆడపిల్లలయి ఉండటమే కారణం. అతనిలో ఎగ్రెసివ్ (Aggressive) స్వభావం, దౌర్జన్య ప్రవృత్తి పెరుగుతుందేగాని దానిని ప్రయోగించగల ధైర్యం ఉండదు. అందుకే తనకు అందుబాటులో ఉన్న ఆడపిల్లల్ని అవమానించటం ప్రారంభిస్తాడు. తన దురవస్థకు వారే కారణమన్న అజ్ఞాత భావన అతనిమీద బాగా పనిచేస్తూ ఉంటుంది.

అంతమాత్రాన ఆడవారిని అనుభవించలేడు. యెలా వారిని ఆకర్షించాలో యెలా ఒప్పించాలో, యెలా అనుభవించాలో తెలిస్తేగా: యెవ్వరూ అందులో అతనికి శిక్షణగాని, రక్షణగాని కల్పించటం లేదు

ఈ దశలో స్నేహితుల మధ్య చర్చలు, అధికప్రసంగాలు పారంభమవుతాయి; ముందు ఆడపిల్లలగురించి—— ఆ తర్వాత ఏకాంత దురభ్యాసాలగురించి, పరస్పర అఘోరతి గురించి తెలుసుకుంటాడు. ప్రయోగిస్తాడు. తొలి స్ఖలన సమయంలో మూర్ఛపోతాడు. వివశత్వం పొందుతాడు ఈ విధంగా స్వరతిలో ప్రవేశించి ఉపశాంతి పొందటం పారంభిస్తాడు.

అయినా అతనికి మనశ్శాంతి ఉండదు. తాను చేస్తున్నది చేయకూడని పని అని తెలుసు—— దానివలన యెన్నో ప్రమాదాలు కలుగుతాయన్న భయం బాధిస్తూంటుంది అయినా అతను చెయ్యకుండా ఉండలేకపోతాడు. తన బలహీనతకు తానే సిగ్గుపడి, అవమానపడి, నలుగురిలో తిరగలేక, ఒంటరిగా తన గదిలో, చీకటిలో దాంకుంటూ, పశ్చాతాపముతో కుమిలిపోతూ, స్వరతికి వ్యతిరేకముగా మనసును మలచుకుంటూ నిద్రరాక తిరిగి హస్తప్రయోగానికి పాల్పడి, పిదప నిద్రపోతాడు.

కష్టపడి నిగ్రహానికి ప్రయత్నించినా స్వప్నస్ఖలనాలు అదరగొట్టటం ప్రారంభిస్తాయి. వాటిలో మరీ మానసికంగా కృంగిపోతాడు. స్వప్నస్ఖలనాలు ప్రమాదం కాదని తెలిస్తే హస్తప్రయోగం చేసుకోడు.

ఇక ఆడపిల్లల విషయం: రజస్వలకావటంతో ఆ అమ్మాయి బెదిరిపోతుంది. సమాజంనుంచి. తరుముతూ ఉరుముతూ చూసే మగవారి చూపుల నుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తుంది. మగవారిని అసహ్యించుకుంటుంది కాని కామ స్వప్నాలు ఆ పిల్లను వేధిస్తాయి. యోని చెమరుస్తుంది తెల్లవారేసరికి యోని ఉపరితలం జిగటగా ఉంటుంది. దురద పెడుతుంది, దాని

తో అక్కడ పైపైని గోక్కోవటం, నలపటం ప్రారంభిస్తుంది. దీనివలన ఆమెలో సుఖానుభూతులు కలుగుతాయి. అది స్వరతి అని తెలియకుండానే దానికి పాల్పడుతుంది గనుక మానసికంగా కృంగిపోదు.

హస్తప్రయోగం చేసుకుంటే అంగం పెరుగుతుందని ఆ కుర్రవాడికి యెవరో చెపుతారు. అందుకోసమే అతను ప్రారంభించటం జరుగుతుంది.

పెళ్ళయి భార్యతో కాపురం చేస్తున్నవారుకూడా ఆమె జబ్బుపడినా, గర్భవతి అయినా, పురిటికెళ్ళినా, పుట్టింటికెళ్ళినా, తామ కామాన్ని అదుపు చేసుకోలేక స్వరతికి పాల్పడతారు. స్వరతికి బాగా అలవాటు పడినవారు ప్రక్కలో భార్య ఉన్నా ఆమె ముందు స్తంభనశక్తి పొందలేక హస్త ప్రయోగం చేసుకోవటం జరుగుతోంది. భార్య ఆకర్షించలేకపోవటం మరోకారణం. స్త్రీలయందు వికర్షణ జలగటంకూడా కారణమే చాలామంది పెద్దవయసు మగవాళ్ళుకూడా భార్యల్ని రమించటం మానివేసి హస్త ప్రయోగానికి లోనవటం మనం చూస్తూనే ఉన్నాం. వీరెవరికీ పరస్త్రీ సాంగత్యాన్ని అభిలషించే ధైర్యం లేదు. అవకాశం కూడా లేకపోవచ్చు. సుఖవ్యాధులభయం కావచ్చు: సాంఘికావమానభయం కావచ్చు.

తమ భార్యల యోని అధికపురుళ్ళవలన బాగా వదులయిపోయిందని కనుక రతి సమయంలో శిశ్నానికి తగిన బిగి యోనినుండి లభించటంలేదని చాలామంది మగవారు ఫిర్యాదు చేస్తున్నారు, అందువలననే వారు తమ భార్యలతో అధోరతి (Sodomy) కి గాని, పరస్పర హస్తప్రయోగానికిగాని, లేదా స్వరతికిగాని పాల్పడటం జరుగుతున్నదంటున్నారు.

భార్య అనారోగ్యమూ, అయిష్టత కారణంగా అప్పుడప్పుడు ఆమెతో రతి జరుపుతున్నా యెక్కువసార్లు స్వరతిలో పాల్గొంటున్నవారు కూడా ఉన్నారు. కేవలం నిద్రపట్టక హ॥ ప్ర॥ కి పాల్పడేవారే యెక్కువ.

సైనికులూ, నావికులూ ఈ కోవకొస్తారు.

కొందరికి స్త్రీ సంపర్కమే లక్ష్యంగా ఉండదు. వారికి అసభ్యమయిన కామ సంతృప్తితో ఆనందం లభిస్తుంది. స్త్రీని బంధించి, యోనిలో లాటీలను మెలిపెట్టి, చన్నుల్ని ముక్కలు ముక్కలుగా కొరికి, ఆమె రోధిస్తుంటే ఆనందించేవారు శాడిస్టులు. ఆడదానిచే తన్నించుకోవటం, కొరడాలతో కొట్టించుకోవటం, కరిపించుకోవటం ద్వారా ఆనందించేవారు మేసోచిస్టులు. ఆడవారిచేత మూత్రం పోయించుకుని, అందులో తడవటం, ఆమూత్రాన్ని తాగటంద్వారా ఆనందించేవారు కొందరు. ఆమెమీద మూత్రం పోసి సంతోషించేవారు కొందరు వీరు యూరోలాగ్నిస్టులు. స్త్రీని బలాత్కరించి, చెరిచి వెంటనే కత్తితో పొడిచి చంపేవారు పేషన్ మర్డర్స్. మగవారి పురీషద్వారంలో రమించేవారు హోమోసెక్సువల్స్ — వీళ్ళందర్నీ కూడా శాస్త్రజ్ఞులు Para haliacs అంటారు. అనగా వీళ్ళకు స్త్రీలను రమించటం లక్ష్యమే కాదు. వారితో అసభ్యమయిన, జుగుప్సాకరమయిన సంతృప్తిని పొందటమే లక్ష్యం. ఈ సంతృప్తి ఈ రకం ఊహలలో వీరికి లభిస్తుంది. ఆ ఊహలతో వారికి హస్తప్రయోగంలో లభించే ఆనందం సహజ రతిలో లభించదు. దానికి కారణం వారి మనసు ఆ సమయంలో "ప్రత్యేక సుఖప్రేరకభావన'' లతో (Spe.i i: pleasure arousing fantasy) నిండి ఉండటమే అని స్టెకిల్ చెప్పి ఉన్నాడు.

వీరంతా తమ నపుంసకత్వానికి కారణం హ॥ ప్ర॥ అంటారు. అది కొంతవరకూ నిజమే. ఆ రకం ఊహలు వారిలో కామోద్రేకాన్ని కలిగిస్తాయి. కామోద్రేకం వారిలో ఆ రకం ఊహల్ని కలిగిస్తుంది.

నిజానికి స్వరతివలన పూర్తి నపుంసకత్వంరాదు. అది నరాల దుర్బలత్వాన్ని తెచ్చి, మహాఅయితే శీఘ్రస్ఖలనాన్ని కలిగిస్తుంది. స్త్రీలను రమించాలనే కోరిక ఇచ్చి జనించకుండా చేస్తుంది. నపుంసకత్వమే వచ్చేటట్లయితే

స్త్రీని రమించలేనివాడు హస్తప్రయోగం యెలా చేసుకోగలుగుతున్నాడు? హస్తప్రయోగం చేసుకునేవాడు నపుంసకుడు కానక్లేగదా!

స్త్రీ సంపర్కం ప్రారంభం కావటంతో కొందరు పూర్తిగా స్వరతిని మానుకుంటున్నారు. కొందరు మానుకోలేక పోతున్నారు. కొందరు రెండింటినీ ఏక కాలములో ముగిస్తున్నారు. కొందరు స్త్రీ సంపర్కాన్ని అసలే చెయ్యలేక కేవలం హస్తప్రయోగంతోనే తృప్తి పడుతున్నారు.

యెందువలన ఇలా జరుగుతున్నది?

రతికన్న హ॥ ప్ర॥ గమే బాగా ఉండటం వలన భార్యను రమించలేక స్వరతికి పాల్పడుతున్నారన్న మాట! కొందరికి హ॥ ప్ర॥ కన్నా రతియే రుచి చటం వలన హ॥ ప్ర॥ న్ని పూర్తిగా వదిలేసున్నారన్నమాట వీరికి ఆడవారి సౌందర్యం యెక్కువ ఆకర్షకంగా ఉండి ఉంటుంది. ఆడవారి సౌందర్యంమీద మనసు లేనివారు ఆమెయందు యే వాంఛా కలగక హ॥ ప్ర॥ లోనే పరవశించటం జరుగుతోంది. హ॥ ప్ర॥ సమయంలో వీరికి కలిగే భయంకర ఊహాజనిత ఆనందమే వారిని నిజంగా శాడిస్టులవంటి పారాఫిలియాస్ కాకుండా కాపాడుతున్నది. అనగా వారు ఆ రకం ఊహాత్మక పారాఫిలియాస్ కాకుండా ఉంటే నిజంగానే పారాఫిలియాస్ అయి సంఘ విద్రోహులయి ఉండేవారన్నమాట! హస్తప్రయోగంలో వారికి ఆ రకం ఊహాత్మక సంతృప్తి లభించి, నిజ జీవితంలో పెద్దమనుష్యుల్ని చేస్తున్నది.

కారణం—హస్తప్రయోగం మగవారిని సిగ్గరులను చేస్తుంది. వారిలో సహజంగా ఉండవలసిన చొరవనీ, సాహసాన్నీ నమ్మ చేస్తుంది. అందుకే ఆడవారిని తప్పించుకుని తిరిగే స్వభావం హస్తప్రయోగులలో యెక్కువగా ఉంటుంది.

ఆడవారు స్వరతికి అలవాటు పడినందువలన మరింత సిగ్గరులవుతారు వారుమ్నా ఏకాంతవాసానికి అలవాటు పడతారు. పురుషులయందు అనాసక్తు లవుతారు. పురుష స్పర్శకు యేమాత్రమూ పులకరించలేనంత జడులవుతారు రతిలో యే విధమయిన ఆనందాన్నీ అనుభవించ లేనంత స్తబ్ధులవుతారు. తమ యోని అందాన్ని పోగొట్టుకుంటారు. కనుక తమ భర్తను సహితం ఆ భాగాన్ని చూడనివ్వరు రతికే ఒకపట్టాన ఒప్పుకోరు—ఒప్పుకున్నా రతిలో యేమాత్రం సుఖించరు.

ఈ రకం ముదిరిన స్త్రీలూ, పురుషులూ వివాహేచ్ఛ కోల్పోతారు— కనుకనే బెండకాయ ముదిరినా, బ్రహ్మచారి ముదిరినా పనికిరారన్న సామెత వచ్చింది.

మగవాడు తన అంగం చిన్నదనీ, అది స్త్రీని రమించటానికి పనికి రాదనీ ఆందోళన పడుతూంటాడు. ఈ మనస్తత్వానికే Penis complex అనిపేరు: హస్తప్రయోగంవలన అంగం చిన్నదయి పోయిందనీ, తనకు నపుంసకత్వం వచ్చేసిందనీ అనుకుంటాడు. యెక్కువగా స్వప్నస్ఖలనా లు అవుతున్నా, యురెత్రోరియా ఉన్నా ఇలాగే అనుకోవటం జరుగుతోంది ఈరకం ఆత్మన్యూనతాభావం (Inferiority complex) వలన తాను రతి యందు స్త్రీని సంతృప్తి పరచలేనని ఆమెవలన అప-స్యానికీ అవమానా నికీపాల్పడతాననీ భయపడతాడు. అందుకే హస్తప్రయోగంతో సరిపెట్టుకుం టాడు. కొందరు మగవాళ్ళు తోటి మగవాళ్ళతో అధోరతికి సిద్ధపడటం. బొత్తిగా రజస్వలకాని చిన్నపిల్లల్ని సంభోగించటానికి ప్రయత్నించటం ఈ కారణంవలననే.

## రోగకారణాలు

ఇంతవరకూ మనం చెప్పుకున్న కారణాలన్నీ శారీరకమయినవి. వాటి వెనుకనే మానసిక కారణాలుకూడా ఉన్నాయి.

ఇక జాడ్య సంబంధమయిన కారణాలవలన హస్తప్రయోగానికి లోన వటం యెలా జరుగుతోందో యిప్పుడు చెప్పుకుందాం.

కొందరికి యోనిమీదనూ, శిశ్నంమీదనూ చర్మవ్యాధులుంటాయి. అవి పెట్టే దురదవలన హ॥ ప్ర॥ అలవాటు అవుతుంది. ఫిమోసిస్సు, ప్రోస్టేటు హ్యాది పోస్టీరియర్ యురెత్రా, మూత్రకోశమూ, మూత్రపిండ వ్యాధులు. వెసికల్‌కాల్క్యులస్ హస్తప్రయోగాన్కి దారితీస్తాయి. స్త్రీలకు యోనిదురద (Pruri is vulva) చాలా చికాకుపెట్టి హస్తప్రయోగాన్కి కారణమవుతుంది కొన్ని రకాల మానసిక వ్యాధులకూ, నరాల వ్యాధులకూ హస్తప్రయోగం లక్షణం కనుక ముందుగా వాటికి చికిత్స జరగాలని మేక్స్ హనర్ వ్రాశాడు.

హస్తప్రయోగం వ్యాధిగా పరిణమించిన కేసులలో కేవలం మ దుల వల్లనే పరిస్థితి చక్కబడదు. ముందు మూడు నెలలపాటు మందులు వాడి శరీరస్థితిని చక్కబరచాలి. ఆ తర్వాత సైకోథెరఫీ చెయ్యాలి. అప్పుడుగాని ఆ రుగ్మతం పూర్తిగాపోదు. ఈ సత్యాన్ని సెక్సు స్పెషలిస్టులు యెవరూ గుర్తించినట్లులేదు. అందుకై వారి వైద్యంకూడా సత్ఫలితాలను ఇవ్వటంలేదు ప్రోస్టేటుగ్రంధి, ప్రోస్టాటిక్ యురెత్రాలకు సంబంధించిన వ్యాధులు అందరికీలేవు.— యెక్కడో సకృత్తుగా ఉంటాయి. అలాంటి కేసులకు సైకోథెరఫీ అపసరంలేదు' తతిమ్మా కేసులన్నిటికీ మందులతోపాటు సైకోథెరపీ కూడా కావాలని మా అనుభవం ఋజువు చేసింది.

మానవ శరీరం కేవలం పదార్థమూ యంత్రాంగమూ కాదు. శరీరము ఆత్మల కలయిక అది, కనుకనే చాలా వ్యాధులు మనో శారీరిక వ్యాధులు (Psychosomatic disord rs) అయి ఉన్నాయి. శీఘ్రస్ఖలనం. నపుంసకత్వం, హోమోసెక్సువాలిటీ, స్టెరిలిటీ నంటివి ఈ కోవకు చెందినవే. శరీరంతోపాటు మనసుకూడా బాగుచెయ్యకుండా అవి నివారణకావు ఈ సిద్ధాం

తానికి మూలపురుషుడు కెన్నెత్ వాకర్. ఆయన చికిత్సా విధానాలను మేము అవలంభించాం. దానితో యెంతటి నపుంసకత్వాన్ని అయినా క్షణంలో పోగొట్టగలిగాము. శీఘ్రస్కలన వ్యాధిని నిర్మూలించ గలిగాము.

ముందుగా మూడు నెలలు మందులు తీసుకోమంటున్నాము. దానితో నరాల వ్యవస్థ, గ్రంధుల యంత్రాంగమూ చక్కబడుతున్నాయి. పది నిముషాల పాటు రతిని నిర్వహించగల శక్తి వస్తున్నది. అంతటితో ఆగిక మూడు నెలలు కాగానే సైకోథెరపీ నిమిత్తం దంపతులిద్దర్నీ రప్పిస్తున్నాం. ఇందులో భార్య సహకారంకూడా చాలా అవసరం. అతనియందు ఆమెకున్న ద్వేషాన్ని పోగొట్టి, అనుమానాల్ని తీర్చి అతనికి సహకరించే మనస్థితిని కలిగించాలి. ఆ తరువాత అతనికి సైకోథెరపీ జరుగుతుంది. అనంతరం ఉభయుల జననాంగ పరిమాణాలకూ, నిర్మాణానికీ అనుకూలమయిన రతివిధానాలను వారికి చెపుతాం. వాటిని అనుసరించి శీఘ్రస్కలనాన్ని పరిపూర్ణముగా జయించగలుగుతారు అరగంటనుంచి, గంటదాకా రతిని సాగిస్తారు. ఇక ఆ దంపతులిద్దరూ ఆజన్మాంతమూ అదే విధానాన్ని అవలంభించాలి. ఒకరి విధానం ఒకరికి సరిపడదు గనుక పర స్త్రీతో ఈవిధానం పనిచేయదు

మందులు వాడినా యేమాత్రం సంతృప్తి పొందని ఒకానొక దంపతుల్ని మా కార్యాలయానికి రమ్మని సైకోథిరపీ చేశాము. అనంతరం వారు స్వగ్రామం వెళ్ళిపోయారు. అక్కడనుంచి వ్రాసిన ఉత్తరాలని మేము ఈ దిగువ ఉదాహరిస్తున్నాము.

"పూజ్యులగు రాంషాగార్కి,

మీ సలహాప్రకారం క్రమక్రమంగా శీఘ్ర స్కలనాన్ని అదుపులో పెట్టి, మీ దయవల్ల సుమారు అరగంటవరకూ రతిని నిర్వహించగలస్థాయికి చేరుకున్నాను. మీ సలహా ప్రకారము నూతన పద్ధతులతో నూతన

జీవితం ప్రారంభించగలిగినందుకు మా దంపతులిద్దరమూ జీవితాంతమూ మేము మీకు కృతజ్ఞులమయి ఉంటాము.

—టి. జె. రావు.

ఆయన సతిమణి తన సంతోషాన్ని వ్యక్తం చేస్తూ వేరే ఉత్తరము ఒకటి వ్రాశారు.

"రాంషా అన్నగార్కి,

మీవద్ద సెలవు తీసుకుని క్షేమంగా ఇల్లు చేరుకున్నాము. మీ సలహా ప్రకారము మేము బాగానే రతిలో పాల్గొంటున్నాము. మీరు మాకెంతో మేలు కలిగించినారు. మా జీవితములో యెంతో ఆనందం కలిగించినారు. మీ మేలు ఈ జన్మలో మరచిపోలేము.

—చంద్రికళ

అంతేకాదు; అంగస్తంభనాన్ని యెన్నిగంటలయినా నిలవరించే శక్తి కావాలనుకున్నప్పుడు స్ఖలనంతో ముగించే శక్తి మావల్ల చాలా మంది పాఠకులు పొందగలిగారు. ఇది సైకోథిరపీలోనే సాధ్యమవుతుంది.

బూతు కథల పత్రికలు చదివి "ఎ" సర్టిఫికేట్ గల సినీమాల్ని చూసి చాలామంది యువకులు—ముఖ్యంగా అత్యధిక కామం కలిగినవారు నరాల దుర్బలత్వం కలిగినవారు- హస్తప్రయోగానికి లోనవుతున్నారు. ఇది వారి శరీరాన్ని క్షీణింపజేస్తోంది. మనసును మలినం చేస్తోంది.

మగపిల్లల్ని స్వేచ్ఛగా ఆడపిల్లలతో కలిసి తిరగనివ్వాలి. అప్పుడే వాళ్ళ మగతనం వృద్ధిపొందుతుంది. కొందరు తమ మగపిల్లల్ని తోటి మగపిల్లలతో సహితం తిరగనివ్వరు. దీనివలన వారికి Introversion, Auto-erotism లు వస్తున్నాయి.

శృంగార సినీమాలు చూస్తున్నప్పుడు హస్తప్రయోగం చేసుకునే యువకులు చాలామంది ఉన్నారు. తలిదండ్రులు రతి జరుపుకుంటూండగా చూసి స్వరతికి పాల్పడినవారున్నారు. స్నేహితుల ప్రోద్బలం వలనో బూతుకధా పత్రికలు చదవటం వలనో తమ కామాన్ని అణచుకోలేక స్వరతిలో ప్రవేశించినవారూ ఉన్నారు. కొందరికి జననాంగాలకు పట్టిన చిడుము హస్తప్రయోగానికి దారితీస్తున్నది. యెక్కువగా పుస్తకాల పురుగులవలె జీవిస్తూ, సంఘ సంబంధాలు లేకుండా జీవితం గడిపే నరాల దుర్బలులకు స్వరతి నిత్య కృత్యమయిపోతున్నది— అలాకాక ఆటపాటలలోనూ, సాంఘికసేవ, రాజకీయాలు, లలితకళలూ మున్నగువాటిలో నిమగ్నమయి బాహ్య ప్రపంచంలో జీవించేవారు దీనికంతగా పాల్పడరు. వీరికి దీనివల్ల ప్రమాదంలేదు.

# స్వరతి - నపుంసకత్వం

స్వరతికి అలవాటు పడినందువల్ల శాశ్వత నపుంసకత్వం వస్తుందనే అభిప్రాయంతో మేము ఏకీభవించటంలేదు. మొత్తంమీద నరాల దుర్బలత్వం వస్తుంది. దానికితోడు పశ్చాత్తాపమూ, పాపభావన, ఆత్మన్యూనతాభావనా కలుగుతాయి. తలనొప్పి, పార్శ్వనొప్పి, కాళ్ళపీకులూ, దృష్టి దోషాలు కలుగుతున్నాయి. మనుష్యులు చిక్కిపోతున్నారు. శీఘ్రస్ఖలనం, ఏంగ్జయిటీన్యూరోసిస్, సప్రైటీ ఇంపొటెన్సీ కలుగుతున్నాయి.

దీనివలన శాశ్వత నపుంసకత్వం రాదని యెందుకంటున్నామంటే, అది చికిత్సకు లొంగి సత్వరం మనుష్యులు కోలుకుంటున్నారు గనుక, స్త్రీలకు జడత్వం వస్తోంది. వారు ఒహపట్టాన రతిని ఆనందించలేక పోతున్నారు.

అయితే అన్నిరకాల నపుంసకత్వానికి స్వరతియే కారణంకాదు. నానా రకాల మానసిక నిషేధాలు మానసిక నపుంసకత్వాన్ని కలిగిస్తున్నాయి.

లోకంలో స్వరతికి పాల్పడని మనుష్యులు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నారు ఉన్నవారందరికీ ఆ కారణంవల్ల నపుంసకత్వమూ రావటంలేదు. కనుక స్వరతివల్ల నపుంసకత్వం రాదనుకోవటం పొరబాటు. ప్రతి శరీరానికి కొంత రోగనిరోధక శక్తి ఉన్నట్టే, స్వరతివల్ల కలిగే అలసటను నిరోధించే శక్తి కూడా ఉన్నది. వారి ఆచరణ ఈ హద్దును దాటినప్పుడే అది అత్యధికస్థాయిలో ఉన్నట్లు, అదే స్థాయి అందరికి అత్యధికస్థాయి అయే అవకాశంలేదు ఈ విషయంలో యెవరిస్థాయి వారిదే అవుతున్నది. ముఖ్యంగా సున్నితమయిన శరీరం కలవారు కాయకష్టం యెరుగనివారు, విద్యార్థులు, సహజంగా బలహీనులు స్వరతికి పాల్పడి నపుంసకులవటం జరుగుతోంది. కాయకష్టం చేసేవారికి దీనిప్రభావంలేదు.

యేది యేమయిన అత్యధిక స్వరతిలో పాల్గొన్నవారి శారీరిక ఆరోగ్యం కూడా అంతమాత్రంగానే ఉంటుంది. నిస్త్రాణ, నడుమునొప్పి, కాళ్ళపీకు తలనొప్పి వీరిని కృంగదీస్తాయి. రతేచ్ఛ లేకపోవటం, శీఘ్రస్ఖలనం, రతిభంగమూ వారికి నిరుత్సాహం కలిగిస్తాయి. అవివాహితులకు వివాహమంటే భయం వివాహితులకు భార్యదగ్గరకు వెళ్ళటమంటే భయం సహజంగా ఏర్పడతాయి. కొందరిని యిది యే హీనస్థాయికి తీసుకెడుతుందో వారి ఉత్తరాలనుబట్టి అభిసారిక పాఠకులు గ్రహించగలరు. ముఖ్యంగా విద్యావంతులు సెల్ఫ్-కాన్షస్ అయి, ఆత్మన్యూనతా భావంతో కృంగిపోతారు. అందులో సెల్ఫ్-సెంటర్డు భావంగలవారు సమాజాన్ని తప్పించుకుని ఏకాంతంలో జీవిస్తారు. చాలా సందర్భాలలో తీవ్రమయిన న్యూరోటిక్ లక్షణాలు పెంపొందుతాయి.

అత్యధికవ్యభిచారంగాని స్వరతిగాని 'నరాలకేంద్రాలు అలసిపోవటానికి' తమయిన రక్తపు ఒత్తిడికి లోనవటానికి, ప్రోస్టేటుగ్రంధి ఉబ్బిపోవటానికి దారితీస్తాయి. ఈరకం శారీరికమయిన మార్పులు మరింతగా స్వరతికి

పోగొట్టబడిస్తాయి. చివరికి హ॥ ప్ర॥ మానలేని దుర్బలస్థితికి పేషెంటు ఒక్కోవస్తాడు. ఇదొక విషవలయం. కామోద్రేకం యెక్కువవుతూ ఉంటుంది. రిలీఫ్‌కోసం తపన పెరిగిపోతుంది. చివరకి దానిని పొందలేని స్థితి వస్తుంది" అంటాడు స్టైకిల్.

ఆరోగ్యవంతులకీ, దృఢకాయులకీ హస్తప్రయోగం యేమీ అపకారం చేయలేదనేది సత్యం. అనారోగ్యవంతులకీ, బలహీనులకీ ప్రమాదం తెచ్చే మాట నిజమే.

హస్తప్రయోగం అలవాటుగా ఉన్నంతకాలమూ ఫరవాలేదు. మానివేసిన తర్వాతనే న్యూరాస్థనిక్ లక్షణాలు ప్రబలటం కనబడుతుంది.

మరో ముఖ్య విషయం. రతిలో లేని మెదడు కేంద్రంలోని నరాల శ్రమ హస్తప్రయోగంలోనే యెక్కువగా కనబడుతుంది. కారణం. హ॥ప్ర॥ లో ఊహకు యెక్కువ ప్రాధాన్యత ఉండటమే. రతి సమయంతో కామానుభూతులు. ప్రేరణలు సునాయాసంగా లభిస్తాయి. మాటలు, స్పర్శ. చూపులు చుంబనాలు. కౌగిలింతలు మనోహరంగా ఉండి శరీరాన్నీ. మనస్సునీ. మత్తులో ముంచెత్తుతాయి. హ॥ ప్ర॥లో ఇవేవీఉండవు. యాంత్రికమయిన కామ ప్రేరణ కలిగించుకోవలసి ఉంటుంది. లేని స్త్రీ సౌందర్యాన్ని మనసులో ప్రతిష్టించుకోవలసి ఉంటుంది. తద్వారా మానసిక శక్తుల్ని దుర్వినియోగపరచుకో వలసి వస్తుంది. విలువయిన నరాల వ్యవస్థను చెడగొట్టుకోవలసి వస్తుంది.

అందుకే అత్యధిక రతిలో పాల్గొనే వాడికన్నా అత్యధిం హస్తప్రయోగానికి లోనయ్యేవాడు యెక్కువ దుర్బలుడయి, క్షీణదశలో కనిపిస్తాడు

కామాన్ని అణచుకోవటం కష్టం. ముఖ్యంగా మగవాళ్ళకది మరీకష్టం అందుకే 12–18 యేళ్ళ మధ్య యువకులు నిద్రపట్టక కళ్ళు ఎర్రబడి.

ఆపసోపాలకు లోనవుతాయి. ఆ దశలో వాళ్ళు నిద్రపట్టటంకోసం హస్తప్రయోగానికి సహజంగా పాల్పడతారు. పాల్పడుతూ తద్వారా తమవీర్యాన్ని వృధాగా పోగొట్టుకుంటున్నామన్న మానసిక వ్యధకు లోనవుతారు. నిగ్రహం లేని తమ దుర్దశకు కించపడతారు. ఈ మనోవేదనే సంక్రమించి, పెచ్చుపెరిగిన దశలో హ॥ ప్ర॥ నికి మళ్ళీ ప్రయత్నించి స్తంభనము సరిగాలేక, స్ఖలనంకాక కంగారు పడతారు. దానితో తాము నిజంగా నపుంసకులమయిపోయామన్న అభిప్రాయం వాళ్ళలో స్థిరపడుతుంది. భయంతో హ॥ ప్ర॥ మానివేస్తారు. దానితో స్వప్న స్ఖలనాలు ఉదయ స్తంభనాలు ఆగిపోతాయి. భయం పెరిగిపోతుంది. ఈ దశలో తమ పుంసత్వాన్ని రుజువు చేసుకునేందుకు యే అమ్మాయినో పట్టుకుంటారు. హడావిడిగా ఆమెతో ప్రయత్నించబోతారు. ఒళ్ళంతా చెమటపట్టి ముఖం వెలవెల బోతుంది. యెంతసేపటికి అంగం స్తంభించదు. స్తంభించినా చాలా బలహీనముగా ఉంటుంది. అంగప్రవేశం జరగదు యెలాగోపట్టి బలవంతాన ప్రయత్నింపబోతే స్ఖలనమయి ఊరుకుంటుంది. ఆమె అతన్ని ఛీత్కరిస్తుంది అతన్ని కొజ్జాగా అవమానిస్తుంది.

ఈ రకం తొలిప్రయత్నం వివాహమయిన తొలి రోజున చేసి, భార్యచే అవమానింపబడ్డవారు అసంఖ్యాకంగా ఉన్నారు. కొందరు స్త్రీలు భర్త నపుంసకుడని యాగీచేసి విడిచిపెట్టేశారు. కొందరు తమ ఖర్మ ఇలా కాలిందని ఏడుస్తూ మొగుణ్ని అసహ్యించుకుంటూ ఆ యింటిలోనే పడిఉంటున్నారు. మరికొందరు భర్తను తృణీకరించి పర పురుషులతో పొందును స్థిరపరుచుకున్నారు. భర్త తన నపుంసకత్వాన్ని అంగీకరించి భార్యకు ప్రియుల్ని సంపాదించిపెట్టే తార్పుడు వాళ్ళుగా మారిన సందర్భాలు కూడా చాలా ఉన్నాయి.

కనుక హస్తప్రయోగంవల్ల ప్రమాదంలేదని అనగలమా? వివాహ విచ్ఛిత్తికన్నా ప్రమాదం ఉందా?

అయితే ఇదంతా అతనికి శారీరిక దౌర్బల్యంగా. అంతకుమించి మానసిక దౌర్బల్యమువల్లనే వచ్చిందని మనకు తెలుసు కనుకనే అతనికి హా॥ ప్ర॥ వలన ప్రమాదం లేదని హామీ యివ్వాలి. ధైర్యం కలిగించటం కోసమె ఆ మాట చెప్పాలి. అయినా ప్రత్యక్షానుభవం అతగాడు మన మాటల్ని విశ్వసించకపోవచ్చు. అతనికి ఆ భయం ఒక్కటేకాదు. కావలసింది, నిక్కచ్చి అయిన ఫలితాలు. భయాన్ని పోగొడుతూ నరాల దుర్బలత్వం పోవటానికి మేము వైటెక్స్ యిస్తున్నాము. కామ ప్రకోపానికి సెక్సుటోను యిస్తున్నాం. జననాంగపు అధిక శైత్యం తాత్కాలికంగా ప్రతిష్ఠించటానికి ఎనిస్థటిక్ అయింటుమెంటు యిస్తున్నాం. అన్నిటికీ మించి రతవిదానాలలో శిక్షణ యిస్తున్నాం. ఈరకం కేసులలో సెక్సోథెరపీ బ్రహ్మాండముగా ఉపయోగపడుతుంది. ఇదంతా జరిగిన తరువాత అతనిభయాలుపోయి, బలంపుంజుకొని, కామశిల్పాన్ని సాధించి గంటవరకూ నిలబడగల స్థితిని పొందుతున్నాడు.

కనుకనే హా॥ ప్ర॥ వల్ల కలిగిన నపుంసకత్వం శాశ్వతం కాదని ఢంకా బజాయించి చెపుతున్నాము. నూటికి నూరుకేసులూ విజయాన్ని సాధించిన అనుభవం మాకుంది. అదే మాకు గర్వకారణం.

మనల్ని సంప్రదించక పోయినా మగవాళ్ళలాగే ఆడవాళ్ళు కూడా హా॥ ప్ర॥ ను లోనవుతారని లోగడ మనం చెప్పుకున్నాము. పైకి చెప్పుకోవటానికి సిగ్గు అడ్డంరావచ్చు. అసలు విషయం చెప్పటంమాని తమకు తలనొప్పి. నడుమునొప్పి. ముట్టుకుట్టూ. తెల్లబట్ట అవుతున్నాయని చెపుతారు అంటే అదే అర్థం. మామూలుగా హా॥ ప్ర॥ కి లోనుకాని స్త్రీలు కూడా రతి లభించని దశలో బహిష్టు ముందురోజులలో హా॥ ప్ర॥ లోనవ్వుతారు. వీరికి వైటెక్స్ బాగా పనిచేస్తుంది.

---

ఈ పైన మేము పేర్కొన్న ఔషధాలు మావద్దనే లభిస్తాయి వివరాలకు మాకే వ్రాయాలి. సం॥

# నిగ్రహం

నిగ్రహం చాలా అవసరమని ఇలాంటి సందర్భాలలో చాలామంది యువకులకు సలహాయిస్తారు. సలహా యిచ్చినంత తేలిక విషయం కాదని వారికీ తెలుసు. అదీగాక, నిగ్రహం వల్లనే ఒత్తిడి యెక్కువై మతిస్థిమితం తప్పే ప్రమాదముందని వాళ్ళకి తెలియదు. కామం సహజమయినది. అది సహజ విధానాలలోనే తీరాలి. అంటే యుక్త వయసు వచ్చిన యువతీ యువకులంతా వివాహ వ్యవస్థలో ప్రవేశించాలి. అదిమాని, యెన్నికబుర్లు చెప్పినా ప్రయోజనం శూన్యం. ఆచరణ సాధ్యంకాని సలహాలకు మేము విలువనివ్వలేము.

కామాన్ని ఉన్నతీకరించుకోవచ్చునని (S..blima ion) కొందరంటారు రెండుపూటలా చన్నీటిస్నానం. రాత్రి వెచ్చని అన్నంతిని. వేడి నీళ్ళ స్నానంచేసి. మూత్రంపోసుకుని. కటికనేలపై వెల్లకిలా పడుకోవటం వంటి బ్రహ్మచర్య విధులు కామోధృతాన్ని కొద్దిరోజులు సడలిస్తాయేగాని.పూర్తిగా తొలగింపజేయలేవు. కామగ్రంధులు నిత్యమూ కామరసాలను ఉత్పత్తి చేస్తూనే ఉంటాయి కామనాడీ కేంద్రాలు కామప్రేరణను కలిగిస్తూనే ఉంటాయి. మనసు వాంఛను ప్రేరేపిస్తూనే ఉంటుంది. మనసును అణచుకున్నా శరీరం తిరగబడుతుంది. ఆ రెండిటి సంఘర్షణకూ లోనయి నరాల వ్యవస్థ విచ్ఛిన్నమయి ఎపిలెప్సీ. హిస్టీరియాల పాల్పడ్డవారు యెందరో ఉన్నారు. అలాంటప్పుడు వ్యాధికన్నా చికిత్స ప్రమాదకరమయినదికదా? బలత్కార నిగ్రహంకన్నా హ॥ ప్ర॥ మే ఆరోగ్యకరమయినది. హ॥ ప్ర॥ కన్నా స్త్రీ పురుష సంబంధమే ఉన్నతమయినది. ఈ సత్యాన్ని యెన్నడూ మరచిపోకండి.

ప్రకృతి సహజమయిన విధగా దాంపత్యంలో కామాన్ని చల్లార్చుకోవటానికి బదులు జపాలూ, ప్రార్థనలూ చేస్తూకూర్చుంటే శరీరధర్మాన్ని

అరికట్టగలమా? కాలకృత్యాలను తీర్చుకోవటానికి బదులు బంధిస్తే ప్రాణం నిలుస్తుందా?

యేదో ఒక వ్యాపకంలోనో, తీవ్ర మనోవ్యథలోనో నిమగ్నమయిన వారికి కామం తాత్కాలికంగా చచ్చిపోయే మాటనిజమే. ఆ వ్యథ పోగానే రెట్టించిన ఉధృతంతో కామం విజృంభిస్తుంది. అప్పుడిక ఆ మనిషికి పట్టపగ్గాలుండవు.

కామప్రేరకమయిన సినీమాలను చూడవద్దని. నవలల్ని చదవవద్దనీ కామ పూర్వకమయిన ప్రసంగాలలో పాల్గొవద్దనీ. అట్టి ఊహల్ని రానివ్వద్దనీ చెపితే చాలు. అవి ప్రయత్న సాధ్యాలు. దీనివల్ల అనవసరపు ప్రేరణ ఉండదు. అంతమాత్రాన సహజకామం లేకుండాపోదు.

అందుకే వివాహమొక్కటే అవాంతర మవుతుంది.

మానసిక నపుంసకత్వాన్ని పోగొట్టటం తేలికే కావచ్చుగాని శారీరిక తరహా స్వరతికి చికిత్స చేయటంకష్టం: అందుకు భార్య సహకారం కావాలి. క్రమంగా అతనికి స్థయిర్యాన్ని ధైర్యాన్ని కలిగించి దాంపత్యానందాన్ని సాధించే నైపుణ్యం ఆమె నేర్చుకోవాలి. భార్యల సహకారంఉన్న కేసులు ఏ ఒకటి విఫలంకావు.

యేది యేమయిన హ॥ ప్ర॥ వల్ల యే ప్రమాదము లేదని హామీ యివ్వటం యెంత తప్పో. అన్నీ ప్రమాదాలేనని హడలుగొట్టటం అంతే తప్పు.

హస్తప్రయోగం చేసుకున్నంత మాత్రాన యెవడూ విచారించడు. కృంగిపోడు. యెటొచ్చీ దానికి బానిసనయి పోతున్నానని గ్రహించినప్పుడే ఈ నిర్వేదం ప్రారంభమవుతుంది. నిర్వేదం ఓటమిని కలిగిస్తుంది. ఓటమి నిర్వేదాన్ని కలిగిస్తుంది ఇది మరో విషవలయం.

అందుకే హ॥ ప్ర॥ పనికిరాదని భయపెట్టటంగాని, దానివల్ల కలిగే అనర్థాలగురించి అతిశయోక్తులు చెప్పటంగాని యేమాత్రం పనికిరాదు. దాని వల్ల మరింత ప్రమాదముంది. దీనివల్ల అతని ఆరోగ్యం చెడిపోతుందని చెపితే, అప్పటికే నైతిక సంఘర్షణతో సతమతమవుతున్న అతగాడు మరింత కృంగిపోతాడు. అతని నిస్పృహ మరింత పేట్రేగుతుంది, అతన్ని దహించవేసే రహస్యాగ్నులకు మరింత ఆజ్యం పోసినట్లవుతుంది. వాటితో పోరాడే శక్తి క్షీణిస్తుంది. ఈ బెదిరింపులకు లోనయి ఆరోగ్యం మరింత చెడగొట్టుకుంటాడు. లేకుంటే శరీర ఆరోగ్యం అంతగా చెడదు, ఈరకం బెదిరింపుల్ని కొనసాగనివ్వటానికి వీలులేదు. ప్రతికూల వైఖరిని అనుసరించి అతన్ని కృంగదియటంకన్నా అనుకూల వైఖరి ననుసరించి అతన్ని తగువిధంగా సంస్కరించి వివాహ వ్యవస్థలో పడేటట్లు చేయటం అన్నివిధాలా ఉత్తమం.

అందుకే మేము ఆత్మశక్తికి (Willipower) యెక్కువ ప్రాధాన్య తనిస్తాము. సంఘంలోని తోటి ఆడపిల్లలతోనూ, మగపిల్లలతోను కలిసి మెలసి తిరిగే అవకాశం కలిగించే యెన్నో వ్యావృత్తులున్నాయి. వాటిని కల్పించుకుని చక్కగా నలుగురితోటి కలసిమెలసి తిరగమంటున్నాం. మను ష్యులు ముడుచుకుపోయి ఒంటరిగా జీవిస్తూ తోటి ఆడపిల్లలనుండీ, మగ పిల్లలనుండీ తప్పించుకు తిరగటంవల్ల వారిలో రతి విముఖత ఏర్పడుతు ది ఇది చాలా ప్రమాదం ముదిరిన హస్తప్రయోగానికి స్త్రీ సంపర్కం యే మాత్రం ఆనందాన్నివ్వదు, ముఖ్యంగా యోని శీర్షాన్ని, మూత్రద్వారాన్ని ప్రయోగించుకున్న స్త్రీలకు పురుష వైముఖ్యం యేర్పడుతుంది,

మరో ముఖ్యవిషయం, హస్తప్రయోగులకి దేనిని సాధించాలన్న ఉబ లాటం ఉండదు. యే ప్రయత్నమూ లేకుండా ఉన్నదానిని వినియోగించు కోవటంతోనే తృప్తిపడతారు. అదేకదా స్వయంతృప్తి! పర్యవసానంగా

వారిలో చొరవ నశించిపోతుంది. బొత్తిగా సిగ్గరులయి కూర్చుంటారు. ఇదీ ఈనాటి యువతీ యువకుల స్థితి. ఈ దశలో వీరిని బాగుచేయటం చాలా కష్టమని మా మనవి.

ఈ వ్యసనానికి ఉత్తమ చికిత్స పెళ్ళి ఒక్కటే అని చెప్పాముగదా అని యే చికిత్సా తీసుకోకుండానే నేరుగా వివాహం చేసుకోవటం మరీ ఘోరం స్తంభన వైఫల్యాదులు కలిగి శోభనం విఫల కావటంతో ఆత్మ హత్యలు చేసుకున్నవారూ, విడాకులు తీసుకున్న వారూ, ఆత్మ విశ్వాసం పూర్తిగా నశించిపోయినవారూ చాలామంది ఉన్నారు. పొగలోంచి సెగలోకి దూకినట్లవుతుంది

అందుకే అవసరమయిన మందులు వాడాలి. తగిన సలహాలు తీసుకోవాలి, వైద్య సలహానను సరిచి వివాహం చేసుకోవాలి. ఏ సమస్యవచ్చినా కుమిలిపోక వెంటనే పత్ని సహితంగా ఆ డాక్టర్ని సంప్రదించి, పరిష్కరింప చేసుకోవాలి. అప్పుడుగాని ఈ సమస్యకు శాశ్వతమయిన పరిష్కారం లభించదు.

## యోని దురద

ఆడవాళ్ళ హస్తప్రయోగానికిది ప్రధాన కారణం. వుల్విటిస్ (యోని మంట), ల్యుకోరియా (తెల్లబట్ట) ల్యుకొప్లాకియా (యోని అంతరాధరాల లోపల యేర్పడే తెల్లమచ్చలు)—లకు ఇది లక్షణం. రతి అసంతృప్తికూడా ఈ యోని దురదకు కారణం కావచ్చు. మూత్రంలో షుగరూ, చీమూ ఉన్నవేమో పరీక్ష చేయించాలి. వాటివల్ల చిరాకు కలిగే అవకాశంఉంది. నులి పురుగులు, మూలశంఖవంటి వాటి ప్రభావంవల్లకూడా ఈ యోని దురద కలగవచ్చు.

ఈ దురద బాధ భరించలేక హ॥ ప్ర॥ కు చాలామంది స్త్రీలు పాల్పడవలసి వస్తున్నది. రెండుశాతం ఫెనాల్ కలిసిన కేలమిన్ లోషన్ రాస్తే ఈ

చిరాకు తగ్గుతుంది. అయిదు శాతం థైమోల్‌గాని, మెన్‌థాల్‌గాని, పది శాతం కొకెయిన్‌గాని కలిసిన ఎనాల్జెసిక్ ఆయింటుమెంటు రాస్తే తీవ్ర స్థాయిలో ఉన్న దురదలుకూడా తగ్గుతాయి.

కొందరికి దురదలు న్యూరోసిస్ కారణంగా కలుగుతాయి. అలాంటి కేసులలో బ్రోమైడ్‌గాని, వేలిరిన్‌గాని నోట్లో వేసుకోమనవచ్చు. బీజవాహిక బిగి పడలిన స్థితిలో స్టిల్‌బోయిస్ట్రాల్ రోజుకు మూడు మి. గ్రా. చొప్పున మూడు వారాలపాటు యిస్తే మంచిది ఏది యేమయినా సమర్థుడయిన డాక్టరుచే చికిత్స చేయించుకోవటం చాలాముఖ్యం.

## అత్యధిక కామం

అత్యధిక కామం కొందరి మగవాళ్ళలో విచిత్రమయిన సమస్యల్ని కల్పిస్తుంది. వాంఛ ఉధృతమయి యెంతటికీ చల్లారకపోవటం, అంగము అదేపనిగా స్తంభించి ఉండిపోవటం. ఏమాత్రం ప్రేరణకయినా అంగము స్తంభిస్తూ ఉండటం సటీరియాసిస్, ప్రియాపిజం, శీఘ్రస్కలనం.

స్త్రీలలోకూడా కొందరికి యిదేవిధంగా కామదాహం, నింఫొమానియా వెజినస్మస్‌లు యేర్పడతాయి.

వీటికి కారణాలు అంగ సంబంధమయినవి కావచ్చు. గ్రంధులకు సంబంధించినవి కావచ్చు మానసికమయినవి కావచ్చు. కొందరికివి వ్యాధులయితే, కొందరికివి సమస్యలుకావచ్చు. అది స్థాయినిబట్టి ఉంటుంది.

## సటీరియాసిస్

ఇది వ్యాధివర్గానికి చెందినది. ఇది ఏర్పడటానికి తగు కారణాల్ని ఇంకా శాస్త్రజ్ఞులు కనిపెట్టలేదు. కొందరికి తీరని కామంవల్ల ఈ స్థితి రావచ్చు.-

తలా టివారు రతి జరిపితే అంగస్తంభనం సడలిపోతుంది. అప్పుడది వ్యాధికాదు అంగం గట్టిగా స్తంభించి ఉంది. యెన్ని సారులు యెంతసేపు రతి జరిపినా చల్లారక ఉండిపోయే దశయే వ్యాధి.

"ఇది స్వతంత్రమయిన వ్యాధియా, లేక సైకోసిస్‌కిది లక్షణమా?- అన్న విషయంముపై యింకా అభిప్రాయ భేదాలున్నాయి. మెదడు, వెన్నుపూస అపసవ్యంగా పనిచేయటంవల్ల యేర్పడిన భయంకర సైకోసిస్ యొక్క లక్షణమే సటీరియాసిస్ అంటాడు ఫాల్కు (Pa.k.) అత్యధిక కామ సైశిత్యంవల్ల యేర్పడిన స్థితి యిది అంటాడు Wulffen అతని అభిప్రాయం ప్రకారం సటీరియాసిస్ గాని, నింఫొమానియాగాని వక్రకామానుభూతులు (Sexual Perversions) కావు. సామాన్య వ్యాధులు మాత్రమే. ఈ వ్యాధులకి జననాంగాలే స్థావరం. ఇవి వంశపారంపర్యంగా సంక్రమించేవికావు ఈ వ్యాధులు సంక్రమించినవారు క్షీణించరు. "శారీరక అధిక సైశిత్యము వలన ముఖ్యంగా జననాంగ అధిక సైశిత్యంవలననే ఇవి సంక్రమిస్తాయ"ని Kr fft Ebing అన్నాడు.

ఈ సటీరియాసిస్‌కు తరచు తీవ్రమయిన సయికోసిస్ తోడ్పటము జరుగుతుంది. కనుక ఆ వ్యక్తులలో యేదోరకం ఉన్మాదం ఉంటుంది. కావున దీనికి మదపిచ్చి అని పేరువచ్చింది.

సటీరియాసిస్‌కు మగ "మదపిచ్చి అనీ నింఫొమానియాకు ఆడ మదపిచ్చి'' అని పేరు పెట్టుకోవచ్చు. యేమయినా ఈ రకం పిచ్చిని పూర్తిగా పోగొట్టటం కష్టం.—యెక్కడోగాని ఇవి తీవ్రస్థాయిలో కనిపించవు.

వెరుమోంటనం బాగా ఉబ్బిపోవటం వల్లనే సటీరియాసిస్ వస్తుందని Max Huhner అన్నాడు. చాలా స్ట్రాంగ్ సిల్వర్ నైట్రేటుతో ఈ వెరుమోంటనమును కాల్చివేసేవాడు. మరీ ముదిరిన కేసులలో ఈ చికిత్స సాధ్యంకాదు.

మనస్తత్వ వేత్తలు దీనినే మానసిక వ్యాధిగా భావించి హిప్నొసిసు చేయాలంటున్నారు.

కొందరు నల్లమందునూ, క్లోరోఫారం, ఈథర్ వంటి మత్తుమందుల్ని వినియోగించాలంటున్నారు.

The crimes of the Genital Sense అన్న గ్రంథంలో Jacobus ఈ వ్యాధిగురించి విపులంగా వర్ణించాడు.

ఏ కారణవల్ల కలిగనివ్వండి: ఈ మదపిచ్చి (Satyriasis) మనుష్యులకు కామోద్రేకంతో కూడిన సంధి, యెంతకీ చల్లారని కామం, అనునిత్య అంగిస్తంభనం ఉంటాయి. యెన్నిసారులు స్ఖలించినా అంగం చల్లారదు. అతని మనసు అతని ఆధీనంలో ఉండదు. ఉన్మత్తుడయిపోతాడు. వివేకం యేమాత్రం పనిచేయదు. ఈ స్థితి అతనికి అంగం స్తంభించిన వెంటనే ప్రారంభమవుతుంది. దానితో అతను ఆడవాళ్ళను రేప్ చేస్తాడు. చిన్నపిల్లల్నీ, వయసులో ఆకర్షణీయంగా ఉన్నవాళ్ళని అంటూలేదు. తనకు యెదురుగా యెవరు కనిపిస్తే వారు తల్లి అయినా, చెల్లి అయినా, ముదుసలి అవ్వ అయినా సరే—యెంత అసహ్యంగా ఉన్నా సరే. ఆడదయితే చాలు. ఆడది కనిపిస్తే చాలు వాడు తన ఆధీనం తప్పుతాడు: అతని జ్ఞానేంద్రియాలు అదుపు తప్పుతాయి. క్రూరంగా వెళ్ళి, ఆమెమీదపడి, జాకెట్టు చింపి, చీర ఊడలాగి—విరోధిస్తే గొంతుపిసికి చంపి అయినా సరే—నును వెచ్చని ఆమె యొక్క శవాన్ని సంభోగిస్తాడు.

ఈరకం మనుష్యుల ముఖం ఆ సమయంలో యెర్రగా కందగడ్డలా ఉంటుంది. తలలోంచి ఆవిర్లు వస్తాయి. మనస్థిమితం తప్పుతుంది. కనుగుడ్లు ముందుకు ఉబికి వస్తాయి. నోటిలో నురుగు వస్తుంది; సరిగా కామం పరాకాష్ఠకు వచ్చిన ఋతువులో ఉండే మగజంతువులా ఉంటాడు. ఈ ఆవేశంలో యే వయసు ఆడదానిమీద అయినా సరే ఒక్క ఉదుటున దూకి,

నేలకు పడగొట్టి. కర్కశం గా రతిని జరుపుతాడు. ఒక్కరాత్రి 40 సార్లు రతి జరిపిన వారున్నారు, అయినా వారి కామదాహం చల్లారదు. సాధారణ స్త్రీ అంత అనుభవాన్ని తట్టుకోలేదు. ఆమె యోని వాచి రక్తం కక్కుతుంది ఆమెకు స్పృహ తప్పుతుంది, కొంతసేపటికి ప్రాణాలు విడుస్తుంది.

"ఈ దుర్దశ మనిషికి పిట్టులా వస్తుంది. అది యెంతసేపు ఉంటుందో చెప్పలేం మళ్ళీ యెప్పుడు వస్తుందో చెప్పలేం. ఈ పాశ్విక కామము చల్లారిన తరువాత అతనికి వివేకం అంకురిస్తుంది. తాను చేసిన వెధవ పనికి కృంగిపోతాడు. కుమిలిపోతాడు. నలుగురి ముఖము చూడటానికి సిగ్గుపడతాడు. ఈ దశలో శారీరకంగానూ, నైతికంగానూ తను పడే ఆవేదనను భరించలేక ఆత్మహత్య చేసుకున్నవాళ్ళుకూడా చాలామంది ఉన్నారు"

ఇది వ్యాధికి సంబంధించిన విషయం, అందరికి యింత తీవ్రస్థాయిలో లేకపోవచ్చు. రెండు మూడు గంటలు రతి జరిపినా అంగం చల్లారని స్థితి కొందరికి ఉంటుంది, అది వ్యాధికాదు.

## ప్రియాపిజం

ఏ కామవాంఛా లేకుండా అకస్మికంగా అంగం స్తంభించి, వెర్రిగా నిలపటాన్ని ప్రియాపిజం (Priapism) అంటారు సటీరియాసిసుకీ దీనికీ తేడా ఉంది, మొదటిదానిలో ఉన్మాదముంది. రెండవదానిలో నలుపుడు ది.

నరాలు అకస్మికంగా బిగుసుకు పోయినందువలన ఈ అవస్థ రావచ్చును చిరకాలం కఠిన బ్రహ్మచర్యం పాటించటంవలన రావచ్చు. కేంధరయిడ్సు వంటి ప్రమాదకరమయిన ఔషధాలను తీసుకున్నందువల్ల రావచ్చు దీనికి చికిత్స ఉంది.

ఈ స్థితిలో అంగం బాగా పోటెక్కి రాయిలా అయిపోతుంది. విపరీ

తముగా సలుపు పెడుతుంది. అంగశీర్షం రెట్టింపు లావెక్కుతుంది. బాగా సాగి మెరుస్తూంటుంది. అందలి నరాలు ఉబ్బిపోతాయి. కండరాలు తాళ్ళలా పెన వేసుకుని గట్టిపడతాయి. అంగం పొడవునా బొడిపెలవలె రక్తపు గడ్డలు వేస్తాయి. యివి అంగమూలం వైపు మరీ యెక్కువగా ఉంటాయి. ఆ సమ యంలో అంగాన్ని వేళ్ళతో ముట్టుకుంటేచాలు. విపరీతమయిన బాధ పెడుతుంది. అంగపూర్వ చర్మం ఉబ్బుతుంది. అంగశీర్షం అంగపూర్వ చర్మం కందినట్లు యెర్రబడతాయి.

ఈ పరిస్థితులతో పేషెంటు యమబాధ పడతాడు. అతని బాధను చూడలేము. యేమాత్రం బట్ట తగిలినా బాధ యెక్కువవుతుంది. అంతెందుకు? గదిలో యెవరయినా అడుగులు బరువుగా వేసినా ఆ అదటుకు కూడా పురుషాంగం అదిరి బాధ పెడుతుంది. ఆ సమయంలో పేషెంట్లు తమ రెండు కాళ్ళనీ పొట్టమీదకి లాక్కొని అంగాన్ని సంరక్షించుకుంటారు. ఆ సమ యంలో అంగం పొట్టమీద నిటారుగా అనుకుని ఉంటుంది. భయభ్రాంతుల తో పేషెంట్లు కంగారుపడిపోతారు. ఏదయినా ఉపద్రవం వస్తుందేమో నన్న భయం. యెక్కువగా ఉంటుంది. తమ జీవితం నాశనమయిపోతుంద న్న దిగులు ఏడిపిస్తుంది. మరోవంక భరించలేనిబాధ—అదుర్దా చెప్పనఖర్లేదు

ఈ పొజిషనులో మూత్రం తేలికగా పోసుకోవచ్చు. సటీరియాసిసు అయితే మూత్రం పడదు. ప్రియాపిజం ఉన్నప్పుడుమూత్రం మెల్లగాచుక్క లుచుక్కలుగా విపరీతమయిన మంటతో విడుదల అవుతుంది. ఈ పొజిషన్ లో మూత్రం విడుదల కానప్పుడు ఆ మనిషిని మోకాళ్ళపైనా, మోచేతు లపైన ఆనుకుని ఉండమని మూత్రం పోయించవచ్చు. మూత్రంపోయాలి లేకపో ఈ జబ్బు వదలదు.

ఒక విచిత్రమయిన కేసు చెపుతున్నాము. ఒకతనికి వీర్యస్ఖలనము పూర్తిగా బందు అయింది. యెన్ని రోజులయినా రతి అనంతరం వీర్యం

స్ఖలింపబడటం లేదు. ఈ రకం కేసుల్ని ఎస్పెర్మటోరియా (Aspermatorrhaea) అంటాము. ఈ వ్యాధి రావటానికి ముందురోజు ఆయన రాత్రి పదిగంటలప్పుడు పబ్లిక్ పార్కులో ఒక స్త్రీని బెంచీమీద పడుకోబెట్టి రతి జరుపుతున్నాడు. ఇంచుమించు స్ఖలించే సమయంలో కాపలావాడు కర్ర పట్టుకుని అక్కడకు వచ్చాడు. అదిచూసి అకస్మాత్తుగా లేచి, భయం, అవమానం, ముంచెత్తగా, జోళ్ళయినా తొడుక్కోకుండా అక్కడనుంచి ఒక్క ఉరుకులో గోడదాటి పారిపోయాడు. విడిచిపెట్టిన స్త్రీనీ, జోళ్ళనీ ఉదారంగా ఆ కావలివానికి వదిలివేసి పారిపోయి ఆత్మ రక్షణ చేసుకున్నాడు. పెద్దమనిషిగదా! జారిణి కనుక ఆ అమ్మాయికి కావలివాడి చేతిలో దెబ్బలు కోర్టులో శిక్ష పడ్డాయి. భారతీయ స్త్రీలకీరకం అవమానం చట్టబద్ధమేగదా!— సాంఘిక మర్యాదకూడా పోనివ్వండి.

ఇంటికొచ్చి చూసుకున్నాడుగదా అతని అంగం అలాగే స్తంభించి రాయిలా ఉంది. చన్నీటితో కడిగాడు, తడిగుడ్డలు చుట్టపెట్టేడు. అయినా గాని స్తంభనం తగ్గలేదు. విపరీతంగా 4 5 గంటలపాటు నిలిపింది. హస్త ప్రయోగం చేసుకుని, ఆ బాధ వదిలించుకుందామని ప్రయత్నించాడు, కాని అది సాధ్యం కాలేదు. దజనుసారులు ప్రయత్నించినా ప్రయోజనం లేక పోయింది. చివరికి స్నానాల గదిలో ప్రవేశించి చన్నీళ్ళ తొట్టిలోకూర్చుని గంటసేపు నానా అవస్థా పడగా ఇంద్రియ స్ఖలనం జరిగి అతని క్రియా పిజం శాంతించింది.

ఆనాటి అనుభవం వలన దడపట్టుకుని మళ్ళీ మళ్ళీ అ ప్రియాపిజం వస్తుందేమోనన్న భయంతో రోజూ చాలాసారులు హస్త ప్రయోగమునకు లోనయ్యేవాడు. ఇలా మూడు సంవత్సరాలు గడిచే సరికి వీర్యస్ఖలనము పూర్తిగా బంద్ అయిపోయింది.

దీనిని బట్టి అత్యధిక హస్తప్రయోగం వలన నిర్వీర్యత్వం (Aspermatorrhaea) వస్తుందని బుజువవుతుంది.

# చికిత్స

ముఖ్యంగా వ్యభిచారులు ఆకస్మికంగా ప్రాణ ప్రమాదకర పరిస్థితులలో పడినప్పుడు అందునా రతి మధ్యలో ఈ ప్రియాపిజం ఏర్పడే అవకాశం ఉంది. అందుకే ఆ పరిస్థితులలో పడవద్దని పాఠకుల్ని హెచ్చరించటం అయినది.

దీనికి చికిత్స ఏమంత తేలిక విషయంకాదు. అంగాన్ని మంచులో ఉంచాలి. అందులో ప్రవేశించిన రక్తపు ఒత్తిడిని తగ్గించటానికిగాను జలగల్ని కరిపించాలి. బోర్రిమైడు ఓపియం. మార్ఫియాలను మింగించాలి. బెల్లడొన్నా మార్ఫియా సపోజిటీలను మలద్వారంలో ఉంచాలి. పూర్తిగా మత్తు మందు ఇంజెక్షను యివ్వటం మంచిది.

కె.నైత్‌వాకర్ శస్త్రచికిత్సగురించి యిలా చెప్పాడు.

"పెద్దకన్నం ఉన్న సూదిని పురుషాంగపు ప్రతీ కార్పసు కేవర్నోసమ్ లోనికి యెక్కించి, రక్తాన్ని బయటకు లాగెయ్యాలి. ఆ తరువాత కార్పోరాకెవర్నోసాటిస్యూను గోరువెచ్చని ఉప్పునీళ్ళతో కడగాలి. లేదా రెండు అంగుళాల పొడవున నిలువుగా కార్పోరాకేవర్నోసును కోసి ఆ గాయములోంచి రక్తాన్ని బయటకు పిండెయ్యాలి. తర్వాత చిన్న రబ్బరు దామును ఉంచి కోసిన భాగాన్ని కుట్టివేయాలి, ప్రతీకార్పోసు కావర్నోసంకు మధ్యనుండే రక్తధమని తెగకుండా జాగ్రత్త తీసుకోవాలి. స్తంభకటిస్యూలను రక్తపు పోటునుండి ఈ విధముగా విముక్తి చేసినట్లయితే అతని అంగం ప్రశాంత స్థితిని పొందుతుంది!

ఈ విధముగా ఆపరేషనుద్వారా చికిత్స పొందిన వారికి ఆ తరువాత వాంఛ కలిగినప్పుడు అంగ స్తంభనం మామూలుగానే అవుతుందని చెప్పలేం కొందరికి నపుంసకత్వం శాశ్వతముగా వచ్చేసింది. ప్రాణ ప్రమాదము

మాత్రము యెవరికీ కలగలేదు. అయితే ల్యుకోమియా (Leukomi ) ఉన్నవారికి ప్రాణ ప్రమాదం ఉంది.

## నింఫోమేనియా

మగవాళ్ళకి సటీరియాసిసు వంటిదే ఆడవాళ్ళకు నింఫోమానియా. ఈ వ్యాధి సోకిన ఆడవారు యెక్కువగా ఉన్నారు. జననాంగాల వెర్రి ఉద్రేకాన్ని పొందటంవలననే ఈ అవస్థ వస్తుంది. ఇది మూడు దశలలోకి పరిణమిస్తుంది.

పురుషుడుచే లాలింపబడాలనీ, రమింపబడాలనీ లాలస ప్రతి స్త్రీకి ఉంటుంది. అది సహజం. ఆ అవకాశం లేక ఆ కోరిక తీరక, పుస్తకాలలో శృంగార సన్నివేశాలు చదువుతూ, ఊహిస్తూ, తానే కథానాయికగా ఆ మధురానుభూతుల్ని పొందుతూ, పగటి కలలు కనటం ప్రారంభమవుతుంది. రాను రాను యోని ద్రవించటం, ఒళ్ళు మత్తెక్కటం యెక్కువవుతాయి. యోని పెదవులు కామంతో ఉబ్బి సలుపుతాయి. సహజమయిన కామవాంఛ కొంచెం ముదిరిన స్థాయి యిది.—ఊహా పురుషులతో సంభోగాన్ని ఊహించుకుంటున్న కొలదీ ఆమె శరీరం మత్తుయెక్కి స్వాధీనం తప్పటానికి ప్రయత్నిస్తుంది. అప్పుడామె తనలో పెల్లుబికే కామాన్ని అణచుకోవటానికి ప్రయత్నిస్తుంది. నీతినీ, మతాన్నీ అడ్డుపెట్టుకోవాలని చూస్తుంది. దేవతల్నీ దేవుళ్ళనీ స్మరిస్తుంది. ఈదశలో ఆమె హ॥ ప్ర॥ కు పాల్పడితే నిజమయిన ఉపశమనం లభిస్తుంది. అయితే స్త్రీలంతా అందుకు యిష్టపడరు దానిని అవినీతిగా భావించి చన్నీటి స్నానాలను ప్రారంభిస్తారు. మనసును మళ్ళించుకోవటానికి ప్రయత్నిస్తారు. క్షణంలో మరుపు మబ్బు తెరలు కమ్మి

మళ్ళీ కామం విజృంభిస్తుంది. బలీయమయిన మానసిక సంఘర్షణకు లోన వుతారు. దానితో ఆమె ప్రవర్తనలో మార్పువస్తుంది. యెప్పుడూ నవ్వుతూ నలుగురితో కులాసాగా తిరిగే ఆమె విచారంగా, ఒంటరిగా చిరాకుగా ఉం టుంది, కొంటెతనం తగ్గిపోతుంది. మగవారి సన్నిధిలో ఊపిరి బరువెక్కు తుంది. నాడి వేగంగా కొట్టుకుంటుంది. ఆమె ముఖంలో, నడకలో, వైఖ రిలో, సంభాషణలో ఆమెలో మండే అగ్ని జ్వలిస్తుంది.

రెండవ దశలో ఈ లక్షణాలే మరింత ప్రస్ఫుటంగా అవుతాయి. ఆమె మేధాశక్తి, అహంకారం సడలిపోతాయి. ముట్టుకుంటేచాలు ఒళ్ళోపడే స్థితి వస్తుంది. అయినా ఆమె తర్కబుద్ధి విచక్షణ తనకుగా తనను మగవాడికి అర్పించుకోకుండా విరోధిస్తాయి.

ఇక మూడవ దశలో ప్రవేశించే సరికి ఆమెకు యేమాత్రం మాన సిక సంఘర్షణ ఉండదు. నోటికొచ్చినట్లు వాగటం, ఇష్టానుసారం ప్రవర్తిం చటం, ఊహల ఉద్రేకంలో ఉయ్యాలలూగటం ప్రారంభిస్తుంది. శృంగార భావాలు చెలరేగుతాయి. శృంగార సంభాషణలలోకి ప్రవేశిస్తుంది. అసభ్య మయిన పుస్తకాలను చదవటం ప్రారంభిస్తుంది. కోరికలు బరితెగించి అను భవంకోసం ఉరూతలు ఊగుతాయి. ఆమె దారుణమయిన కోరికల్ని రెచ్చ గొట్టవి, అంతర్గత ఉద్రేకాన్ని ప్రేరేపించని, సంభోగ సంబంధము లేని ఏ మాటల్ని ఆమె సహించదు. వినిపించుకోదు, అసహ్యించుకుంటుంది. ఆ ప్రసంగం ఏ కారణం వలనయినా ఆగిపోయిన పక్షంలో తిరిగి తానే ప్రస్తావిస్తుంది.

మగవాడు యెదురుగా ఉన్నంతసేపూ ఆమె శరీరం కుతకుతలాడిపో తుంది. బుగ్గలు యెరుపెక్కుతాయి ముఖం కందగడ్డలా అయిపోతుంది. కళ్ళు మెరుస్తాయి. ఆకలితో వరితపిస్తాయి. రొమ్ములు ఉబ్బుతాయి. ఉచ్ఛ్వాసనిశ్వా సలు ఉద్వేగంతో బరువెక్కుతాయి. రక్తపుపోటు యెక్కువవుతుంది. రక్త

ప్రసరణ ప్రతిష్ఠింభించేటంత ఉధృతమవుతుంది. యోని సలుపు పుడుతుంది వేళ్ళు కొయ్యబారతాయి. యెదుటి మనిషిని అమాంతం కొరుక్కు తినా లన్నంత ఉద్రేకం కలుగుతుంది. దీర్ఘనిశ్వాసలు విడుస్తుం. కొంటెగా చూస్తుంది శరీరంలోని హొయల్ని. ఒంపుసొంపుల్ని వెల్లడిచేస్తుంది. మొత్తంమీద అత నిలో కామోద్రేకాన్ని రెచ్చగొడుతుంది. అతను యేమాత్రం చలించినా యింక ఆగక అతని దగ్గరగా జరిగి ఆమె తన సమస్త శరిరాన్ని అతని చేతులలో పెడుతుంది.

ఈరకం మదపిచ్చిగల స్త్రీలు యెప్పుడూ మగవారికోసమే పరితపి స్తారు. తోటి ఆడవాళ్ళను అసహ్యించుకుంటారు. సజాతి అయిన కారణాన ఆడవాళ్ళను చాలా నీచంగా హింసిస్తారు

స్త్రీకి బహిష్టయ్యే ముందురోజులలోనూ అందులో మగవాడు యెదు రుగా ఉన్నప్పుడే స్త్రీలు అలా అవుతారు.

మూడవదశలో ప్రవేశించిన తర్వాత చికిత్సవలన ప్రయోజనంలేదు పిచ్చాసుపత్రిలోనో. అనుపత్రిలోనో. ఉండటమే మంచిది.

ఈరకం నిఫోమేనియాతో బాధపడుతున్న ముగ్గురు స్త్రీలను మేము పరీక్షించాం—ఒకామెకు న్యూరోసిస్ ఉంది. మిగిలిన ఇరువురూ మామూలు గా ఆరోగ్యముగా ఉన్నారు. ముగ్గురూ పెళ్ళయిన స్త్రీలే నౌకరులూ. పరా యివాళ్ళు అన్న విచక్షణ లేకుండా కనబడిన వాడితోనల్లా పడుకోవటమే వారి ఫిలాసఫీ. లేకుంటే. వారి శరీరం వారి ఆధీనములో ఉండదు.

అయితే యిక్కడొక చిన్న తేడాఉంది. మగివాడు సటీరియాసిస్‌ను దాచుకోలేడు. ఆడది నింఫోమేనియాను దాచుకో గలుగుతుంది.

# అధిక కామవాంఛ

కొంతమందికి కామం యెక్కువగా ఉంటుంది. ఆ సమయములో అంగస్తంభనం ఉండనూవచ్చు. లేకపోనూవచ్చు అంగస్తంభనంతో నిమిత్తం లేకుండా ఈ విధంగా కామవాంఛ ప్రబలంగా ఉండటానికి కారణమేమిటి?

కొంతమందికి ప్రోస్టేటు గ్రంధిపై కురుపు యేర్పడుతుంది. మూత్ర నాళానికి పుండు పుడుతుంది. ప్రోస్టేటుగ్రంధి ఉబ్బుతుంది. జననాంగభాగాలు పగులుతాయి. సిఫిలిస్ రోగం వలన వెన్నుపూసకు చెందిన జ్ఞాననాడులు మూలాలు జబ్బుపడతాయి. వీటివల్ల చికాకు యెక్కువయి మెదడుకు ప్రేరణకలిగి కామవాంఛ ఉధృతంగా ఉంటుంది.

ఇలాంటి సందర్భాలలోనే ఉధృత కామవాంఛను వ్యాధిగా భావించాలి. అది వ్యాధివల్లనే వచ్చిందిగనుక! గనేరియాతో బాధపడే స్త్రీలే వివక్షత లేకుండా పురుష సంపర్కంకోసం పరితపించటం చూస్తున్నాం ఎక్కువమంది వ్యభిచారిణులు యింతే. గనేరియా వ్యాధిగల మగవాడు కూడా స్త్రీ సంపర్కానికై ఆవేశపడతాడు.

పైన పేర్కొన్న వ్యాధులేవీ లేక పోయినప్పటికీ కొందరికి కామం ఉధృతంగా ఉంటుంది దానికి కారణమేమిటి?

శరీర స్వభావమే కారణం ప్రతీ మగాడికి పదహారవ యేటనుంచి ఇరవై నాల్గవ యేటదాకా కామోద్రేకం బలంగా ఉంటుంది. ఆడదాని శరీరానికి ఆ వయసులో అలా ఉండదు. ఆమెకు ఇరవయి నాల్గవ ఏట అంకురించి ముట్టుడిగేదాకా ఉధృతంగా ఉంటుంది. వారి శరీర తత్వాలు అట్టివి. అది సహజం.

ఆ తర్వాత కొన్ని రోజులలోనే నెలా నెలా కామోద్రేకం ఉధృతముగా ఉంటుంది. స్త్రీలకు బహిష్టు ముందు మూడు రోజులూ, బహిష్టు

స్నానం ఆయిన తరువాత మొదటి మూడురోజులూ, నెలమధ్యలో అండ స్రావమయిన రోజులూ అధిక కామోద్రేకాన్ని కలిగిస్తాయి. శీతాకాలంలో వర్షాకాలములో కామోద్రేకం యెక్కువగా ఉండటం కాలప్రభావం.

చాలాకాలం వియోగం తరువాత కలుసుకున్నప్పుడు కామోద్రేకము దుర్భరంగా ఉండటం సహజమే. అలాగే మనం ప్రేమించిన వారితో కలయిక సమయంలోనూ, కొత్త వ్యక్తులతో కలయిక సమయంలోనూ ఇది ఉధృతముగానే ఉంటుంది. కొత్తగా ప్రేమవ్యవహారాలు పెట్టుకున్న స్త్రీ పురుషులందరికీ పునర్యౌవనం వస్తుంది. అంతకంటే సడలిపోతున్న కామానికి మంచి టానిక్ లేదు. అలాగే భార్యా భర్తలిద్దరూ రతికి ముందు ఎక్కువసేపు కామ కలాపాలలో నిమగ్నమయి ఉన్నా కామం చెలరేగుతుంది.

స్త్రీల సాహచర్యం మగవాళ్ళను బాగా ఉద్రేక పరుస్తుంది ఆడవాళ్ళ వహకార సంస్థలలోనూ మహిళా కళాశాలల్లోనూ పనిచేసే మగవాళ్ళకు కామోద్రేకం యెక్కువ. బూతుకథల పత్రికల్ని చదివినా, బూతు బొమ్మల్ని చూసినా, బూతుకబుర్లు చెప్పుకున్నా కామవాంఛ పెరుగుతుంది.

కామవాంఛ యెంత ఉండాలి?— అన్న ప్రశ్నకు అర్థంలేదు. కొందరికి యెక్కువగా ఉన్నదనిపించే కామమే కొందరికి యెక్కువ అనిపించదు. ముఖ్యంగా కామంపై ద్వేషంతో దాన్ని అణచుకో జూచేవారే తమకు కామం యెక్కువగా ఉన్నదని వాపోతారు. కామానుభవం కోసం పరితపించే వారు ఉధృత కామాన్ని వరప్రసాదంగా భావిస్తారు. అట్టివాడు రసికుడనీ, ఆమె రసికురాలనీ గర్వపడతారేగాని సిగ్గుపడరు.

కనుక, కామములో హెచ్చుతగ్గులనేవి ఆ వ్యక్తి వైఖరి మీదనూ, సమాజ వైఖరిమీదనూ ఆధార పడుతున్నాయి.

ఇలాగే ఒకడు తాను నపుంసకుడననీ, తనకు తగినంత వాంఛ లేద నీ ఆక్రోశిస్తాడు. యెవరికి తగినంత? అతని భార్య నడిగితే, అతనిలో ఈ లోపం లేదనీ, అతని సామర్ధ్యాన్ని తానే భరించలేకపోతున్నాననీ చెపు తుంది. అప్పుడు అతగాడ్ని పిలిచి యిదేమిటయ్యా ఇలా చెప్పావని అడి గితే తాను ఊహ్యే ఉన్న సుందరాంగులతో పాటు కూడలేక పోతున్నానని అంటాడు. అతని ఆత్మన్యూనతా భావానికి నవ్వొస్తుంది అతన్ని నపుం సకుడని అనలేముకదా?

మరో ముఖ్య విషయం. కామోద్రేకం మనుష్యులందరికి ఒకే స్థా యిలో ఉండదు. మనిషికో రకంగా ఉంటుంది కొందరిలో అది ఉన్నట్లే కనబడదు. మరికొందరిలో ఇది వ్యాధిగా తయారయిందేమోనన్న అనుమా నం కలుగుతుంది, ఎవరికది సహజంగానే ఉంటుంది. యెక్కువగా ఉన్నవాడు నీచుడూకాడు; తక్కువగా ఉన్నవాడు నపుంసకుడూ కాడు.

సాధారణంగా కామం వంశం మీద, వాతావరణంమీద, ఆరోగ్యంమీద శరీర తత్వంమీద ఆధారపడి వాటికి అనుకూలంగానే ఉంటుంది. కనుక యే వ్యక్తి కామస్థాయినయినా అంచనా కట్టేటప్పుడు వీటన్నిటినీ పరిగణనలోకి తీసుకోవాలి, వ్యాధి మూలకంగాని ఉద్రేక కామంగురించి డాక్టరు పట్టించు కోవలసిన పనిలేదు.

యవ్వనం ఆవిర్భవించిన రోజులలో యువకుని కామం సహజముగా ఉద్రేకముగా ఉంటుందని చెప్పుకున్నాము. ఆ దశలో కుర్రవాడు మనసు చెడగొట్టుకొని ఉద్రిక్తలూగిపోతాడు. విద్యావినయాలు యెరగనివాళ్ళు సాని వాడల వెంటపడతారు. భయస్థులు, వినయ సంపన్నులు హస్తప్రయోగానికి పాల్పడతారు. స్త్రీ సంపర్కం సాధ్యంకాక, హ॥ ప్ర॥ ను జుగుప్సాకర ముగా భావించేవారు స్వప్న స్ఖలనాలకు పాల్పడి. భయపడి, డాక్టరుదగ్గ

రకు పరుగెడతారు. ఇంచుమించు స్పెరంటోరియా స్థాయికి వస్తేగాని ఇలా పరుగెట్టటం జరగదు. ఈ లోగా అణచుకోలేని ఈ ఉద్రేకంవలన అతని దైనందిన జీవితం అస్తవ్యస్తమవుతుంది. మనశ్శాంతి నశిస్తుంది. స్థిమితం తప్పుతాడు. నిద్ర సరిగా పట్టదు సరిగా పాఠాలు చదవలేకపోతాడు. చదివినది అర్థంకాదు. జ్ఞాపకశక్తి నశిస్తుంది బోర్మైకుస్ సెడిటీవ్స్ ఏమి వాడినా ప్రయోజనం ఉండదు.

ఈ దురవస్థ రాకుండా ఉండటంకోసమే ప్రాచీనులు కఠిన బ్రహ్మచర్య నియమాలను విధించారు. చదవండి సృష్టిరహస్యం (రచనః రాంషా)

వాటిని పాటిస్తున్న దశలో పరిస్థితి కొంత చక్కబడుతుంది. స్వప్న స్ఖలనాల సంఖ్య తగ్గుతుంది. స్ఖలనానికి, స్ఖలనానికి మధ్య విరామం కొన్ని రోజులువాకా పెరుగుతుంది. కాని, ముఖ్యంగా నిద్రపోయే ముజదు జననాంగం స్తంభించి పెట్టే బాధను కొంతలో కొంత అణచుకో గలిగినా తెల్లవారుఝాము అతని స్వాధీనములో ఉండదు. ఉండాలంటే అలారము పెట్టుకుని నాలుగు గంటలకే లేచి చదువుకోవాలి.

ఈనాటి నాగరిక వ్యవస్థలో స్త్రీ పురుషులు కలసిమెలసి చదువుకోవటం. తిరగటం. సినీమాలలో శృంగార సన్నివేశాలు. రేడియోలో పాటలు బూతు పత్రికలు. నగ్న స్త్రీ చిత్రాలు—ఇవన్నీ పూర్వంలా బ్రహ్మచారుల్ని బ్రతకనివ్వటంలేదు. ఆనాటి సంయమ దృక్పథంకూడా నేటివారికి లేదు.

పూర్వం యివేవీ ఉండేవికాదు. గురుకులాలలో ఆడపిల్లలయందు తోటి మగపిల్లలకు సోదర భావం ఉండేది. కఠిన బ్రహ్మచర్య నియమాలుండేవి. మాంసం లేని భోజనం మషాలా లేనికూరలు తినేవారు. మద్యం, పొగాకు నిషిద్ధమయి ఉండేవి. విద్యయే లక్ష్యంగా, విద్యాగురువే సమస్తంగా జీవించేవారు. విద్యా పరిపూర్తికూడా పదహారవ యేటతో పూర్తికావటం వెం

టనే వివాహం జరిగేవి ఆ స్వర్ణయుగం వెళ్ళిపోయింది. ఈనాటి పరిస్థితులూ, విద్యావిధానము వేరు. కనుక ఈనాటి విద్యార్థులు వివాహం చేసుకుని గాని విద్యార్జనలోకి దిగకూడదు. కామంకన్నా అర్థం గొప్పదిగా భావింపబడ్డ అనర్థపు రోజులు గనుక, ఎన్నేళ్ళకీ చదువు పూర్తికాక, చదువు పూర్తి అయినా ఉద్యోగం దొరకక, ఉద్యోగం దొరికినా పోషించవలసిన కుటుంబ భారాన్ని త్యజించలేక చాలామంది, ముప్పయ్యేళ్ళు పైబడినా అవివాహితులుగానే ఉండిపోతున్నారు. ఈలోగా వారికి నరాల దౌర్బల్యం ఏర్పడటం, కామం క్షీణించటం, పెళ్ళి చేసుకున్నా పెళ్ళానికి కామ సంతృప్తి కలిగించలేమన్న భయం అంకురించటం జరుగుతున్నాయి కొంతమంది జీవితాంతం అవివాహితులుగానే మిగిలిపోతున్నారు.

ఈ అన్యాయానికి మూలం మన వ్యవస్థలో ఉంది కామానికి మనం యిచ్చిన హీనస్థానంలో ఉంది. మానవుడి స్వార్థంలో ఉంది.

యేది యేమయినా అధికకామంతో బాధపడుతున్నామని, యెవరయినా డాక్టర్ని సలహా అడిగితే, అతని మనసులో ఉన్న కామ సంతృప్తిక విధానంవల్ల ప్రమాదం లేదన్న భరోసాను అర్థిస్తున్నాడని అర్థం. హస్తప్రయోగం, వ్యభిచారం, స్వజాతి సంపర్కంవంటిదేదో అతని మనసులోఉంది దానిని డాక్టరే అతనికి ఉపాయంగా చెప్పాలని అతను ఆశిస్తున్నాడన్నమాట డాక్టరు ఆ రకం సలహా యివ్వకూడదు. వ్యభిచారం. హస్త ప్రయోగం. స్వజాతి సంపర్కం వంటి వికృతికామానుభవాల వల్లనూ, కామాన్ని అణచుకోవటం వంటి దుష్ప్రయత్నాల వల్ల కలిగే మంచిచెడ్డలన్నీ విడమరచి చెప్పాలి. వివాహంకన్నా ఉత్తమ మార్గం లేదని సూచించాలి.

ఆడవాళ్ళకు ఈ సమస్య ఉంది. తలనొప్పి. మోడునొప్పి. నడుమునొప్పి. యోని తడికావటం, యోనినుండి తెల్లని జిగటపదార్థం వెలువడటం జరుగుతున్నాయని అంటారు. ఇవే మనం లోగడ చెప్పుకున్న

శారీరిక లక్షణాలు మనసు స్థిమితం లేదనీ, చిరాకుగా ఉంటున్నదనీ చెపుతారు. ఇవన్ని అసంతృప్తక కామానికి లక్షణాలు పెళ్ళి చేసుకోమనటం మంచిది. పెళ్ళి అయి కాపురం చేస్తున్న స్త్రీ అయితే, ఆమె భర్తనుపిలిచి ఆతగానికి సంతృప్తక రత విదానాలను తెలియజెప్పి అవలు జరిపించాలి.

## వయసు మళ్ళాక మళ్ళీ

అత్యధిక కామవాంఛ యువకులలో ఉండటం సహజం, మధ్యవయసు మగవాళ్ళకి అంతలా ఉండదు. ఇక ముసలివాళ్ళ సంగతి చెప్పాలా? వార్ధక్యమంటేనే కామవాంఛగాని, కామ సామర్ధ్యంగాని లేకపోవటమే గదా: షష్ఠి పూర్తి అయ్యేసరికి పూర్తిగా కొందరికి కామం అణగారిపోయి, కొన్ని సంవత్సరాలపాటు యే విథమయిన ప్రకటనా లేకుండానే, ఆ తరువాత అకస్మాత్తుగా విజృంభించటం జరుగుతుంది.

యెందుకిలా జరుగుతోంది? చచ్చేముందు సారె కావిళ్ళా? ఆరిపోయే ముందు దీపం మండినట్లా? దీనికేదయినా శారీరిక కారణం ఉందా? అతగాడు సిగ్గూ, లజ్జా విడిచి, తాను మనమలు తాతనయినానన్న జ్ఞానమయినా లేకుండా పడుచు పిల్లల్ని చేరదీసి, కులుకుతున్నాడంటే, నలుగురూ ముక్కుమీద వేళ్ళు వేసుకోరా?— ఇంతకీ కారణ మేమిటి?

ఈ సమస్యకు అంతుదొరకక శాస్త్రజ్ఞులు బాగా సతమతమయిపోయారు. నలుగురూ నాలుగు రకలా ఆలోచించారు.

ప్రోస్టేటుగ్రంథి బాగా పెరిగినందువల్ల (హైపర్‌ట్రోఫి) కామవాంఛ జ్వలించటం జరగవచ్చునని కొందరన్నారు.

వార్ధక్యంలో మనసు క్షీణిస్తుందిగదా: కనుక కామాంగాలపై దాని

అదుపు తప్పిపోవటం జరుగుతుంది. అందుకే కొంతకాలం పూర్తిగా కామం చచ్చిపోయినవారిలో అకస్మాత్తుగా కామం అంకురించి కామోన్మాదానికి దారి తీస్తుంది: దీనిని వ్యాధిగానే భావించాలని ఒక శాస్త్రజ్ఞుడు (Rohledet) వ్రాశాడు.

స్టెకిల్ అంటాడు :

"సెనైల్ డెమింటియా (వార్ధక్యంలో బుద్ధి క్షీణించటం), పక్షవాతం మెదడులో కణితెలు (ట్యూమర్స్) వంటి మెదడుకు సంబంధించిన వ్యాధులు మానసిక నిషేధాలను, మంచిచెడ్డల వివేకాన్ని పోగొడతాయి. యిది వ్యాధి లక్షణం. యే వ్యాధి లేకుండానే చాలామంది మగవాళ్ళు షష్టిపూర్తి తరువాత పునర్యవ్వనాన్ని పొందటం జరుగుతోంది: గెటీ (Goethc) వంటి యెందరో ప్రసిద్ధ పురుషులు తమ వార్ధక్యంలో, కూడా కామ కలాపాలతో మరిగిపోయిన వారున్నారు. అలాగే పది పదిహేనేళ్ళపాటు కటిక నపుంసకత్వాన్ని పొందినవారుకూడా, ఆ తరువాత అకస్మాత్తుగా శృంగార పురుషులయిపోవటము చూస్తే నిజంగా మగవాళ్ళకి స్తంభనశక్తి పోవటం కాదని మానసిక నిషేధాలవల్ల అణగారిపోయి ఉండటమే వారి నపుంసకత్వానికి కారణమని నిర్ధారణగా చెప్పవచ్చు. కనుక వార్ధక్యంలో అకస్మాత్తుగా కామోద్రేకం ప్రబలటానికి మానసిక కారణాలే ఉంటాయని నా అభిప్రాయం బహుశా ఆరిపోయే ముందు కొవ్వొత్తు వెలుగు యెక్కువయినట్లే కావచ్చు. చావబోయే ముందు జీవితేచ్ఛ విజృంభించటం కావచ్చు. చావు తెలివి వంటిది కావచ్చు. ప్రేమానుభవంకోసం ఆ జీవి పొందే ఆరాటంకావచ్చు ఇలాగే యుద్ధరంగములో పోరాట దశలో ఉన్న సైనికులు చావబోయేముందు ప్రేమ పిచ్చిలో పడటం చూస్తున్నాం. ఒక కీలక స్థావరాన్ని పట్టుకోబోయేముందు సైనికులు పదిసార్లయినా హస్తప్రయోగం చేసుకున్న ఉదంతాలు నేనెరుగుదును''

ఈ సిద్ధాంతాన్ని మేము పూర్తిగా కొట్టిపేయలేము. మానవ స్వభావాన్ని బాగా తరచిన మీదటే మగవాడికి షష్టిపూర్తి చేయటం ఆ సందర్భములో తిరిగి వివాహం చేయటం అనే ఆచారం హిందువులలో చూస్తున్నాము ఈ రోజులలో పాత భార్యతోనే కొత్త పెళ్ళి చేస్తున్నారనుకోండి అదివేరే విషయం. పూర్వకాలములో కొత్త అమ్మాయినే ఇచ్చి పెళ్ళి చేసేవాడు. ఆ విధంగా పునర్యవ్వనం పొందినవారు దీర్ఘాయువులవుతారన్నది సత్యమే. పాత భార్యనే తిరిగి పెళ్ళి చేసుకున్నవారు. దీర్ఘాయువులు కాకపోవచ్చు. ఇది కూడా మానసిక వ్యవహారమే. పడుచు పిల్లతో సాంగత్యంవల్ల ముసలివయస్సులలో కూడా కొత్తవలపులనుండి కొత్తగా కామరసాలు ఊరి వారు నూతన యవ్వనంతో మిసమీసలాడటం చూస్తున్నాం.

అత్యధిక కానుకలాపాల వల్లనూ, కామ భావనవల్లనూ ప్రతి మనిషిలోనూ పురుష హార్మోనుల ఉత్పత్తి హెచ్చుతుంది. యిందుకు సందేహం లేదు. తాత్త్విక భావనలతో గడిపే యువకులకు కామవాంఛ సన్నగిల్లటం. ముసలి వాలకం రావటం చూస్తున్నాం. కనుక వార్ధక్యంలో కామప్రకోపం కలగటానికి శారీరిక వ్యాధులు కారణం కావచ్చు. మానసిక కారణాలు ఉండవచ్చు.

ముఖ్యంగా పడుచు పిల్లల సాంగత్యంలో పడ్డ ముసలి వాళ్ళలోనే ఈ కామ ప్రకోపం యెక్కువగా కనిపిస్తుంది. అయినా అందరిలోను ఒకే ఫలితం కనబడటం లేదు. కొందరికి తీవ్రమయిన కామవాంచతో బాటు కామ సామర్ధ్యంకూడా పెరుగుతున్నది. కొందరికల కాదు తీవ్రమయిన కామ వాంఛమాత్రమే ఉంటుందిగాని. యేమాత్రం కామ సామర్ధ్యం ఉండదు. అంగస్తంభనం సరిగా లేకపోవటం. శీఘ్రస్కలనం, రతవైఫల్యంవంటివి. సహజంగా ఉంటాయి. ఈనాటి యువకులలో చాలామంది ఆ రకం వృద్ధులలాగే ఉండటం గమనించదగ్గది.

ఇలాంటి వ్యక్తులే డాక్టర్ని సంప్రదిస్తారు. సిద్ధమరధ్వజాలనూ, వసంత కుసుమాకరాలనూ సేవిస్తారు, డాక్టర్ని సంప్రదించేవాళ్ళు కూడా తాము రహస్యంగా ఒక కుర్ర దానితో సంబంధం పెట్టుకున్నామని చెప్పరు; అర్థం చేసుకోవలసిందే,

కొంతమందికి ఇలాంటిదేదీ లేకుండానే వాంఛ యెక్కువకావటం, తమ వయసుకది తగని పనిగా భావించి సిగ్గుపడి డాక్టర్ని సంప్రదించటం కద్దు,

# యోని సంకోచం

కొందరు స్త్రీల యోని అధిక సైశిత్యాన్ని కలిగిఉంటుంది, పర్యవసానముగా బీజవాహికలో బాధ కలిగించే కండర సంకోచం జరుగుతుంది. అనగా బీజవాహికను చుట్టుముట్టి ఉండే కండరాలు, లెవేటర్ ఎనీకండరాలు బిర్రబిగుసుకుపోతాయి, ఆ సమయములో ఆమె ప్రాణం విలవిలలాడుతుంది దీనినే శాస్త్రజ్ఞులు యోని సంకోచం (వెజినస్‌మస్) అని పేర్కొన్నారు,

ఇది స్త్రీల అధిక కామవాంఛకు లక్షణంకాదు

ఈ రకం స్త్రీల యోనిని మనం ముట్టుకుంటేచాలు, వెంటనే ఆమెతన రెండు తొడల్ని పైకి యెత్తివేస్తుంది, బల్లమీంచి ఆమె పిరుదులుకూడా పైకి లెచిపోతాయి. ఆమె భయముతో వెర్రికేక పెట్టి, ఏడ్చేస్తుంది, డాక్టర్ని ప్రక్కకు నెట్టి వేస్తుంది. అలా చెయ్యి వేసినది భర్తయే అయితే అతన్ని గిజాయించటము, దారుణముగా కరవటము. తిట్టటము జరుగతాయి,

యోని ద్వారం సాగుదల శక్తి లేక మరీ యిరుకుగా ఉండటము, కన్నెపొర బాగా ముతకగా ఉండి, బలముగా అంగప్రవేశాన్ని నిరోధించటము వంటి శారీరిక కారణాలవల్ల ఈ వెజినస్‌మస్ యేర్పడుతుంది. కొన్ని వ్యాధులుకూడా వెజినస్‌మస్‌ను కలిగిస్తాయి. ఉదా॥ యోనిలో పుండు,

అయితే చాలా కేసులు మానసిక మయినవే. ఆ పిల్ల రజస్వల కాని బాల్యములో యెవరో ఆమెని చెఱచటానికి ప్రయత్నించటంతో ఆమె నానా హింసా పడటం జరిగి ఉండాలి. అప్పటినుంచి ఆమెకు రతి భయము పట్టుకుని ఉంటుంది.

వెజినస్మస్ వేరు; డిస్పర్యూనియా (యోనిమంట) వేరు. చిరగని కన్నెపొర యోనిద్వారం యిరుకు— ఈ రెండు శారీరిక కారణాలు తప్ప మరో కారణం కనిపించటం లేదు.

ఆవిడకు మత్తుమందు యిచ్చి, కన్నెపొరను శస్త్రంద్వారా తొలగించవచ్చు. యోని ద్వారాన్ని విశాలం చేయవచ్చు. ఆ తరువాత కూడా కొంద రికి వజినస్మస్ ఉండిపోతుంది.

శోభనం నాటి రాత్రి సరిగా రతిచేయటం తెలియని భర్త మోటు ప్రవర్తనవల్లకూడా ఈ వజినస్మస్ వచ్చే అవకాశం ఉంది. ఆ రోజు రాత్రి ఆ పిల్ల యమబాధతో పెద్ద గందరగోళం చేసివేస్తుంది. అతనంటే ఇష్టం లేక అలా అల్లరి చేసిందోమోనని అనుమానపడి బంధువులంతా ఆమెను తిట్టిపోసి ఆ తరువాత రాత్రికూడా ఆమెను గదిలోకి బలవంతముగా తోలటం జరుగుతుంది. ఇది చాలా పెద్ద పొరపాటు మళ్ళీ మళ్ళీ భర్త ఆమెను అదే విధముగా బలాత్కారం చేయటంతో ఆ వ్యాధి స్థిరపడిపోతుంది. ఈ విధముగా ముదిరిన దశలో చికిత్స జరిగినా వ్యాధి కొనసాగటం కనిపిస్తుంది.

నిజానికిదంతా భర్త అంటే యిష్టంలేక పోవటంవల్లకాదు, భర్తఅంటే ఇష్టమే కావచ్చు. కాని, రతి అంటేనే హడలిపోతారు. అది మినహా భర్త యేమి కోరినా ఒప్పుకుంటారు, కనుక ఈ రకం స్త్రీలకు భర్తపై వ్యతిరేక వైఖరి ఉంటుందని పొరబాటు పడరాదు.

అయితే ఈ విధముగా భర్త, ఆమెకు ఏ చికిత్సా చేయకుండానే కొన్ని రాత్రిలపాటు వేధించటం జరిగితే, పగలల్లా ఆమెకు వెన్నునొప్పి, పొత్తి కడుపులో నొప్పి, తలనొప్పి చిరాకు యెక్కువవుతాయి. ఈ రకం నరక యాతన భరించలేక అర్థరాత్రి పడక గదిలోంచి పారిపోయిన అమ్మాయిలు కూడా ఉన్నారు. వీరి ఈ రకం ప్రవర్తనకు ఇటు తలిదండ్రులచేతనూ, అటు అత్తమామల చేతనూ, భర్తచేతనూ చావు దెబ్బలు తినటం జరుగుతోంది. "మాయముండ! ఇలా నటిస్తోందని"ని నిందించటంకూడా కద్దు.

ఈ రకం కేసులు బాగా తీవ్రస్థాయికి వచ్చిన దశలో మా దగ్గరకు చాలావచ్చాయి. అన్ని సందర్భాలలోనూ ఆ ఆడపిల్లల తలిదండ్రులెవరూ ఆ పిల్లలపై ద్వేషం నేకుండా మాట్లాడలేదు.

పాపం, ఆ ఆడపిల్లలు యేమాత్రం నటించటంలేదు. వాళ్ళ కండరాలు వాళ్ళ ఆధీనములో లేకుండా వాళ్ళని నరక యాతనకు గురి చేస్తున్నాయి. ఈ స్థితి ఈ బాధ—అనుభవించిన వాళ్ళకేతప్ప యితరులకు అర్థముకాదు.

ఈ రకం సమస్యగల అమ్మాయిలకు చికిత్సచేయటం చాలా కష్టం. సమీపములో ఆమె భర్తనీ అత్తవారినీ ఉండనివ్వకూడదు. అలాగే పుట్టింటి వారినీ ఉండనివ్వకూడదు. ఆమెయందు సానుభూతి చూపించాలి, భర్తదుర్మార్గాన్ని దుమ్మెత్తి పోయాలి.

ఆమె వంటిమీద చెయ్యివేయకూడదు. ఆమె జననాంగాన్ని పరీక్షించటానికి ప్రయత్నించకూడదు. ఆమె వళ్ళు నెప్పిలకు మందులిస్తున్నట్లు నటించి మత్తుమందు ఇంజెక్టు చేయాలి. ఆమెకు తెలివి తప్పాక ఆమెబీజ వాహికను డైలేటర్స్ సహాయముతో విశాలం చేయాలి. అలా విశాలం చేయబోయే ముందు ఆమె యోనికి ప్రోటోక్రైను ఇంజెక్షను యివ్వాలి. ఈ ఆఖరిదాని ప్రభావం నెలా, నెల పదిహేను రోజులదాకా ఉంటుంది. సులువుగా

పట్టగలిగినంత పెద్ద డైలేటర్ని ఆమె బీజవాహికలో ఉంచివేయాలి. ఆమె మత్తుమందునుంచి కోల్కొని స్పృహ పొందగానే ఆ డైలేటర్ని చూసుకుని ధైర్యం తెచ్చుకుంటుంది. ఆ తరువాత ఆమెనే ఆ డైలేటర్ని బయటకు తీసుకుని రెండు మూడుసారులు పెట్టుకోమని చెప్పాలి. అలా చేయటానికి ఆమెకు భయమయితే డాక్టరు మంచిమాటలతో ఈ పని చేసి చూపించాలి. ఆమె యోనికి మత్తుమందిచ్చి ఉండటంవల్ల ఆమెకే విధమయిన బాధాఉండదు భయం మాత్రమే ఉంటుంది.

ఆమెకు విషయాన్నంతా యిప్పుడు తెలియజెప్పాలి. అవసరమయితే మానసిక చికిత్సకూడా చేయాలి. ప్రోత్సాహమిచ్చి మరో రెండురోజులు పోయాక రతి జరిపించవచ్చు.

# అధిక నైసర్గ్య వ్యాధులు

## అధిక స్తంభనాలు

మనసు ఏమాత్రం చలించినా, అంగానికి ఏ చిన్న ప్రేరణకలిగినా వెంటనే అంగం స్తంభిస్తూ ఉండటం ఈ కోవకు వస్తుంది. దీనికి అంగ శీర్షపు అధిక సైశిత్యమే కారణం. గనేరియా వ్యాధి మరోకారణం. అలాగే చిరకాలం నిగ్రహం పాటించినందువల్ల శుక్రకోశాలు వీర్యంతో పోటెక్కినప్పుడుకూడా ఈ యిబ్బంది యెదురవుతుంది. మలద్వారంలో నులిపురుగులు చేరి చికాకు పెట్టినప్పుడు మూత్రనాళములో రాళ్ళు చేరినా ఈ అవస్థ వస్తుంది.

అసంతృప్త కామం మరోకారణం. కొందరికి హస్తరతి జరుపుకున్నాక స్ఖలనమయినప్పటికీ స్తంభనం సడలిపోదు. మళ్ళీ మళ్ళీ పాల్గొనవలసిన

అవసరం యేర్పడుతుంది. ఒకడు సంతృప్తిగా భార్యతో జరిపితే మళ్ళీ మూడు నాలుగు రోజులదాకా ఆ అవసరం పీలవడు ఆదరా బాదారా రతిని ముగించినా, హస్తరతి చేసుకున్నా. మళ్ళీ దానిఅవసరాన్ని పీలవుతాడు.

కొంతమంది ప్రతిరోజూ ఒకటి రెండుసార్లున్నా హస్తరతికి పాల్పడ తారు. దీనివల్ల వారి స్తంభన యంత్రాంగం బాగా నిశితంగా తయారవుతుంది. అంగానికి యేమాత్రం స్పర్శ కలిగినా, మనసుకు యేమాత్రం కామప్రేరణ కలిగినా వారికి యిట్టే అంగస్తంభనం కలుగుతుంది. ఇలాంటి దశలో హిప్నోటిజంద్వారా మనిషిని గాఢనిద్రలోకి పంపి అతని నిగ్రహశక్తిని ప్రేరేపించటం మంచిదని కొందరంటున్నారు.

శారీరిక కారణాలలో ఆరంభ యవ్వనం ప్రధానం. ఈ సమయంలో ఆ యువకుని శరీరములో హార్మోనుల ప్రభావం ఉధృతంగా ఉంటుంది. శరీరం వాటికి అలవాటు పడనందున కామోద్రేకం పదేపదే కలుగుతుంది అందుకే వివాహానికి అదే యుక్తవయసుగా పెద్దలు నిర్ణయించారు.

యిక మానసిక కారణాలలో కామపరమయిన ఆలోచనలు. అందుకు ప్రేరకమయిన వాతావరణం చాలా ముఖ్యమయినవి. యువతీ యువకులు ప్రేమలో పడ్డప్పుడు వారి వయసు మధురమయిన ఊహలతో నిండిఉంటుంది వారి ఆరాధ్య దైవం యెప్పుడూ వారి మనసుతో ప్రతిష్ఠింపబడి ఉంటుంది దానితో వారి మనసు నిత్య శృంగార కలాపాలలో నిమగ్నమయిఉంటుంది ఈ కారణాలవల్లనే పురుషులకు అంగస్తంభనాలు కలుగుతాయి. స్త్రీలకు యోని రక్తంతో పోటెక్కి స్రావాలు అధికనువుతాయి.

ఇవేవీ కారణం కానప్పుడు అంగస్తంభనం యెడతెంకుండా ఉంటే టేబ్సిడోర్సాలిస్ వంటి నరాల వ్యాధిగాని, ప్రియాపిజం యొక్క ప్రారంభ దశగాని అనుకోవచ్చు. టేబ్సిడోర్సాలిస్ అనేది న్యూరోసిఫిలిస్ లో ఒకరకం. వెన్నుపాములోని జ్ఞాననరాల మూలాలకు ఈ వ్యాధి సోకుతుంది. ప్రియాపిజం అంగం స్తంభించి కొయ్యబారిపోవటం.

పదే పదే అంగస్తంభనాలకు ఆల్కహాలు మరో కారణం. మొదట్లో ఆల్కహాలు కామవర్ధకౌషధముగా పనిచేసినా, తొందరలో అది శాశ్వతపు నపుంకత్వాన్ని కలిగిస్తుంది. అందుకే మద్యపానం మంచిది కాదని చెప్ప వలసివస్తోంది.

కామవర్థకౌషధాలలో కేంథరైడ్స్ అంగస్తంభనాన్ని బలీయంగా కలిగించి యెక్కువసేపు ఉంచుతాయి. అయితే ఈ సమయంలో అంగానికి నెప్పి యెక్కువగా ఉంటుంది. కనుకనే దానిని వినియోగించకూడదని వైద్య ప్రపంచం హెచ్చరిసున్నది.

కొంతమందికి కామవాంఛ చాలా బలంగా ఉంటుంది; కాని ఆ సమయములో యేమాత్రం అంగస్తంభనం ఉండదు. అలాంటి వారి విషయంలో యేవో మానసిక అవరోధాలున్నాయని అర్థం. అవి సైకో యెనలిస్టులతో సంప్రదించినమీదట గాని వెల్లడి కావు. ఈ రకం సమస్యల్ని పోస్టుద్వారా పరిష్కరింపటం సాధ్యంకాదు. భార్యా భర్తలిద్దర్ని పిలిపించి ఉభయుల్ని సంప్రదించవలసిఉంటుంది. మందులవల్ల కం సమస్యలు పరిష్కారం కావు.

ముఖ్యముగా వయసు మళ్ళినవారి విషయములో ఈ రకం కంప్లయింటు యెక్కువగా కనిపిస్తుంది. వారికి కోరికలయితే ఉండవు గాని, ఆదమరచి నిద్రపోకుండా ఈ అంగస్తంనం బాధ పెడుతుంది. వీరికి ఉపశమనకారుల్ని యిచ్చినా యేమాత్రము ప్రయోజనము కనబడదు. కొన్నాళ్ళకు దానికదే పోవలసిందే. ఆరిపోయేముందు దీపకాంతి హెచ్చినట్లే అదీని.

ఆ భాగాలు స్పర్శకూడా సహించలేనంత బాధగా ఉన్నాయంటారు. స్త్రీలు కొద్దిగా జ్వరం వచ్చినట్లుగా ఉందనీ. యోని స్రావాలు అధికమయ్యాయని. తరచుగా మూత్రం పోసుకో వలసివస్తుందని. స్త్రీలు చెప్తుతారు.

# శీఘ్రస్ఖలనం

శీఘ్రస్ఖలనానికీ, గరికతకీ చాలా దగ్గర సంబంధం ఉంది. అనాగరిక జాతులకు ఈ సమస్యలేదు. ఆటవిక జాతులవారికి అసలే లేదు. అనాగరికుడు గంటలు తరబడి భార్యను సంపర్కించినట్లుగా నాగరికుడు సంపర్కించలేడు. నిముషమో రెండు నిమిషాలో సంపర్కించగలడు. ఈ కారణంవల్లనే అనాగరిక స్త్రీలు నాగరికులయిన పురుషుల్ని 'పిచికలు'గా అభివర్ణించి అవహేళణలు చేస్తారు. విద్యావతిగాని నాగరికుని భార్య ఏ ప్రలోభంలోనో పడి అనాగరికునితో ఒక్కసారి పొందుపెట్టుకుంటే ఇంక విడవదు విద్యావంతులయిన స్త్రీలకు ఆ సామర్ధ్యం లేదు. వారున్నూ నాగరికులయినందున నాగరికుడయిన భర్తతోనే సంతృప్తి పడగలరు. అనాగిరికుడ్ని భరించలేరు. ఒక్కసారితో లేవలేని బలహీనతకు లోనవుతారు.

న్యూయార్క్‌లోని పేషెంట్లపై పరిశోధన జరిపి డికిన్ సన్ ప్రతి ఎనమండుగురులోనూ ఒకడు నిముషం మాత్రమే నిలబడ గలడన్నాడు. నూటికి 40 మంది అయిదు నిముషాలదాకా చేయగలరన్నాడు.

మమ్మల్ని సంప్రదించినవారిలో చాలామంది శీఘ్రస్ఖలనానికి లోనయినవారే. మేము అడిగిన ఆడవాళ్ళకూడా చాలామంది తాము భావప్రాప్తి పొందేలోగానే తమ భర్తలు ముగించేస్తున్నారని చెప్పి బాధపడ్డారు. రతియెంతసేపు జరగాలన్న విషయం గురించి ఇంతకు ముందు అధ్యాయాలలో చర్చించుకున్నాంగదా!

శీఘ్ర స్ఖలనానికి ఆంగిక కారణాలు కొన్ని; మానసిక కారణాలు కొన్నీ ఉన్నాయి. ఫిమోసిస్, పేరాఫిమోసిస్. అంగశీర్ష నైశిత్యం. మూత్ర వాహిక. నిశితంగా ఉండటం, ప్రోస్టేటు గ్రంధి ఉబ్బటం. శుక్రకోశాలు

నిండుగా ఉండటం, మూత్రకోశం మూత్రంతో నిండి ఉండటం, నులిపురుగులు, మూలశంఖ—వంటివి ప్రధానకారణాలు. వీటిని సులువుగా తొలగించవచ్చు. చాలాకాలం తరువాత తొలిసారి రతి జరిపినప్పుడూ, ఆకర్షణీయముగా ఉన్న కొత్త స్త్రీతో పొందుకూడినప్పుడు శీఘ్రస్ఖలనం సహజంగా అవుతుంది. యువకులకు తొలిరతి శీఘ్రస్ఖలనముతో ముగిసినా, మలిరతులకు యెక్కువసైము తీసుకుంటుంది.

వెన్నెముక కేంద్రములో చికాకు కారణంగా బలహీన నపుంసకత్వానికి (Atonic Impotence) ప్రతీకగా ప్రాథమిక దశలో శీఘ్రస్ఖలనము కలుగుతుంది. కొంతకాలము భార్యకు దూరముగా ఉంటూ వైద్యసలహా తీసుకోవాలి. మావద్ద దొరుకుతుంది.

శీఘ్రస్ఖలనముతో బాధపడుతున్న పేషెంట్లకు మోకాలిచిప్ప, చీలమండ కడుపు—వీటికి సంబంధించిన కండరాలు పీకు యెక్కువగా కనిపిస్తుంది. మరికొంత మందికి పొత్తికడుపుపై స్పర్శకు కితకితలు కలిగేటంత నైశిత్యము ఉంటుంది, కొంతమంది ఆస్త్మా, ప్రేగులకు సంబంధించిన స్పాజం, గుండె దడదడ (Paroxysmal Tachycardia) వంటివి చెలరేగి కేంద్ర నరాల వ్యవస్థను యెక్కువగా ఉద్రేకపరచటం ద్వారా శీఘ్రస్ఖలనాన్ని కలిగిస్తాయి. (Kenneth Walker)

ఇక మానసిక కారణాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఇవేయెక్కువగా ఉన్నాయి. వీటితో పోలిస్తే అంగిక కారణాలు కలవారు చాలా తక్కువ కావున ఈ అధ్యాయంలో ఈ మానసిక కారణాలన్నిటినీ ఏకరవు పెట్టటం సాధ్యంకాదు.

చిత్రమేమిటంటే కామోద్రేకాన్ని పెంచేవికాని, త్రుంచేవిగాని యే మానసిక కారణాలున్నా అవి శీఘ్రస్ఖలనాన్ని కలిగిస్తాయి.

అంగం బలంగా స్తంభించి ఉన్నా, బలహీనంగా వ్రేలాడుతూ ఉన్నా స్ఖలన్మమయ్యే అవకాశం ఉంది. ఈ రెండవ దానినే ఎటోనిక్ ఇంపొటెన్సి అంటాము. దీనికి శారీరిక, మానసిక కారణాలు రెండూ ఉన్నాయి. అలాంటి పేషెంట్లకు శారీరిక పరీక్షకూడా అవసరం.

మానసిక కారణాలను స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చును. మానసిక నిషేధాలకు (Inhibitions) కి సంబంధించినవి కొన్ని; లగ్నతలకు (Fixations) సంబంధించినవి కొన్ని.

మన నైతిక వైఖరికి విరుద్ధముగా ప్రవర్తించినప్పుడు శీఘ్రస్ఖలనం తప్పకుండా అవుతుంది. ఉదాహరణకి ఒకవ్యక్తి తన యింటి పనిపిల్లతో గాని, వ్యభిచారిణులతోగాని సంభోగించ ప్రయత్నించినప్పుడు.— అది తప్పు పని అని మనసు పీకుతున్న కారణముగా— అంగప్రవేశము కాకుండానే స్ఖలనమయిపోతుంది. ఆ విధముగా అది అతని శీలాన్ని కాపాడుతున్నదని అర్థం. రజస్వల కాని అమ్మాయిని సంభోగించాలని ప్రయత్నించి అంగము స్తంభించక కొందరూ, ముందరే స్ఖలనమయిపోయి కొందరూ విఫలమయినవారు చాలామంది ఉన్నారు. అదే విధముగా తన స్టూడెంటును చేరచబోయిన టీచర్లూ, స్నేహితుని భార్యతో సంభోగించబోయేవారు పేషెంటును రమించబోయే డాక్టరులూ, శిష్యురాళ్ళను చెరచబోయే సన్యాసులు, భార్యకు తెలియకుండా వ్యభిచారానికి పూనుకున్న పురుష పుంగవులూ శీఘ్రస్ఖలనానికో, స్తంభన వైఫల్యానికో పాల్పడతారు. అవినీతి భయమే వారిని అలా త్రిప్పి కొడుతుంది.

మగవానికి శీఘ్రస్ఖలనం కలుగుతున్నదంటే, అంగిక లోపం లేనప్పుడు భార్యను ప్రేమించటం లేదని అర్థం. ఆమెను అనుమానిస్తున్నాడనో, ద్వేషిస్తున్నాడనో, ఆమెచే పరాభవింపబడి ఆత్మవిశ్వాసం లేక కృశిస్తున్నాడనోఅర్థం. స్త్రీలయందు పురుషునికి గల తిరస్కార భావమే ఈ

రూపములో వ్యక్త మవుతుందని స్టెకిల్ అన్నాడు. భార్యయందు అను రాగం పోయినవాడికి అంగస్తంభనం బలహీనమవుతుంది. శీఘ్రస్కలన మయినా అవుతుంది.

కనుక శీఘ్రస్కలనం గలవారి విషయములో మూలహేతువును నిర్దేశించటం యేమంత తేలిక విషయం కాదు. భార్యా భర్తలిద్దర్ని వేర్వేరుగా ప్రశ్నించి మూలకారణాలను గ్రహించాలి. అంగిక పరీక్షకూడా చేయాలి. అప్పుడిక చికిత్స చాలా తేలిక.

సర్వసాధారణంగా నిగ్రహం చేతకాక ఈ దుస్థితికి లోనయ్యేవారే కనిపిస్తారు. వారికి ధైర్యాన్ని కలిగించి, తగు శిక్షణ యిచ్చినట్లయితే సులువుగా సాధిస్తారు.

అంగప్రవేశం చేయబోతున్న సమయములో స్కలనము కావటాన్ని Ejaculatio Ante Portas అంటారు.

# నిదానం ప్రధానం

తనకేదో భరింపరాని లైంగిక వ్యాధి ఉన్నట్లు యే వ్యక్తి అయినా ఫిర్యాదు చేసినట్లయితే వెంటనే చికిత్సకు పూనుకోకూడదు. అతని సమస్య అజ్ఞానమువల్ల కలిగిందే కావచ్చు. శరీర సత్యాలు తెలియక పోయినందువలన కలిగిన వట్టి భయమే కావచ్చు. నిజముగా వ్యాధికావచ్చు— యేదో జాగ్రత్తగా తెలుసుకోవటం అవసరం ఉదాహరణకి : ఒక అసామీ తనకు యేమాత్రం కామోద్రేకం కలిగినా వీర్యం పెల్లుబికి వస్తుందంటాడు. నిజానికది మామూలు యురెత్రోరియాయే ఇది శారీరిక ధర్మం. నిజముగా వీర్యముకాదుగనుక దీనికి చికిత్స అవసరంలేదు. ఇది అజ్ఞానము వలన కలిగిన

సమస్య. సమస్యకానిది వ్యాధి అవుతుంది. గత చరిత్రనంతా అడిగి తెలుసుకోవాలి. వ్యాధి కారణమయిన అంగిక విషయాలను ఒక్కొక్కటే పరిశీలించాలి.

ఏదయినా అంగిక దోషం కనిపించినట్లయితే, తక్షణం దానిని సరి చెయ్యాలి. ఇలాంటి కేసులలో క్రానిక్ గనేరియా ఉండే అవకాశముంది. ఉంటే దానికి చికిత్స చేయాలి. లేకుంటే యిది లోగడ వచ్చిన గనేరియా వల్ల కలిగిన భయమనీ కేవలం మానసిక కారణమని గమనించాలి.

ఆ వ్యక్తి గత జీవితాన్ని, ప్రస్తుత జీవితాన్నీ కూలంకషంగా విని తెలుసుకున్నట్లయితే, యెక్కడ ఈ రకం భయానికి అవకాశం వచ్చిందో తేలిపోతుంది.

అన్నిరకాల లైంగిక వ్యాధులను అనుసరించి యేదో ఒక మానసిక కారణం ఉంటుంది. కొన్ని వ్యాధులకు రతికన్నా ఉత్తమ చికిత్సలేదు. ఆ వ్యక్తి స్వభావాన్నీ, నరాల స్థితినిబట్టి అందుకు అనుకూలమయిన చికిత్సా విధానాన్ని అవలంభించాలి.

కామాన్ని అణచుకోలేక కాలిపోవటం కన్నా, చప్పున పెళ్ళి చేసుకోవటం మంచిది. పెళ్ళి ఆలస్యమయినవారికి మధ్యమధ్య పర స్త్రీ సంపర్కానికి ప్రయత్నించినవారికీ వైఫల్యాలు యెదురయి అదరగొడతాయి. పెళ్ళి చేసుకోవటం ఉత్తమం, లేదా యే స్త్రీ నయినా ఉంచుకోవటం మధ్యమం వేశ్యలతో తిరగటం అధమం, హస్తరతి అధమాధమం, ఈ చివరి రెండిటినీ యెన్నడూ ఆచరించకూడదు, మొదటిది అందరికీ వీలవ్వదు. ఆర్థిక కారణాలు అడ్డు ఉంటాయి అనగా పోషించవలసిన కుటుంబం పెద్దదయి అతనిపై ఆధారపడి ఉండటం వంటివి, కొందరికి సాంఘిక కారణాలు అడ్డు వస్తాయి. ఇంకా పెళ్ళి కావలసిన అక్కలు అన్నలూ ఉంటారు. వాళ్ళం

దానికి పెళ్ళయేదాకా ఆగాలంటే ఈ లోగా ఈ వ్యక్తి ఆరోగ్యం శిథిలమయ్యే పరిస్థితులు యేర్పడతాయి, అలాంటివారికి ఈ మధ్యేమార్గం మంచిది ఉంచుకోవటం వల్ల కుటుంబ భావమూ ఉంటుంది. ఆరోగ్యమూ చెడకుండా ఉంటుంది:

ఇది సత్యమే అయినా మనం సూటిగా చెప్పటం మంచిదికాదు.

రోగికి వైద్యునికి ఉండే సంబంధం జ్యూరికి జడ్జికి ఉండే సంబంధంలాంటిది. రోగి తన సమస్యను చెప్పినప్పుడు దానికి కారణాలను. నివారణోపాయలనూ. వాటి సాధకబాధకాలనూ వైద్యుడు వివరించి చెప్పాలేగాని. ఫలానా విధానాన్ని అనుసరించమని ఆజ్ఞాపించకూడదు. తీర్పు చెప్పవలసింది రోగియే కాని వైద్యుడుకాదు. ఇలా చేయటంద్వారా వైద్యుడు రోగిని ప్రశాంతపరిచి స్థిమితంగా ఆలోచించుకునేలా చేస్తాడు. అప్పుడు ముకి విప్పటానికి బదులు నరకటం వంటివి చేయడు.

ఇక చికిత్స అవసరమనిపించినప్పుడు హేతువు ననువరించి యే చికిత్స నవలంభించాలో వైద్యుడే నిర్ణయించాలి. స్థానిక చికిత్స కొందరికి సరిపోతుంది. కామ గ్రంధులకు సంబంధించిన చికిత్స కొందరికి అవసరమవుతుంది. మానసిక చికిత్స (సైకోథెరపీ) కొందరికి అవసరమవుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ మూడు చికిత్సలు అవసరమవుతాయి.

ఏదేమయినా రోగి నమ్మకాన్ని ముందుగా వైద్యుడు సాధించాలి అతనికి ఈ వైద్యుడే తగిన చికిత్స చేయగల సమర్థుడయినట్లు రోగి గ్రహించేటట్టు చేయాలి. యెట్టి పరిస్థితులలోనూ రోగిని వైద్యుడు మందలించకూడదు. యెంత నీచపు పని చేసినా అసహ్యించుకోకూడదు.

అన్నా చెల్లెళ్ళు. తల్లీ కొడుకులు. తండ్రి కూతుళ్ళు లైంగిక సంబంధాలు గల కేసులుకూడా మా అనుభవంలో యెదురయ్యాయి. వాటి వాటి

వావివరసలగురించి మనం యేమాత్రం పట్టించుకున్నా వారిపై అసహ్యం కలుగక మానదు, దానివల్ల వారికి చికిత్స చేయటానికి మనసు అంగీకరించదు. ఆయా సంబంధాలను ప్రోత్సహిస్తూగాని, ఖండిస్తూగాని మాట్లాడవలసిన బాధ్యత డాక్టరుకు లేదు. కేవలం లైంగిక సమస్యలగురించే పట్టించుకుని, వాటిని పరిష్కరించటానికే ప్రయత్నించాలి.

ఎలాంటి మొండి వ్యాధులయినా పరిష్కరింపబడే అవకాశము ఉంది. ఎటొచ్చీ డాక్టరు సలహా ప్రకారం పేషెంట్లు అక్షరాలా ఆచరించాలి.

( తరువాయి సెక్స్‌సైన్స్ 5 లో చదవండి )



**Edited, Printed and Published by Sri D. RAMSHA at Dharmachakra press, SAMALKOT. Phone 174**